# కచదేవయాని



[ఐదంకముల నాటకము]

అయినాపురపు సోమేశ్వరరాయ
ప్రణీతము.



ప్రింటర్సు అండ్ పబ్లిషర్సు,
సిటీ ప్రెస్, కాకినాడ.
1925.

 [వెల రు 1-0-0.

శ్రీ

# కచదేవయాని

అను

## మృతసంజీవని

(ఐదంకముల నాటకము.)



ఇది

ప్రమదామనోహరము, ప్రహ్లాద, సతీ-అనసూయ, విచిత్రచిత్రముల,
నవరత్నచింతామణి, అభినవసావిత్రి మొదలగునాటకముల

రచించిన

అయినాపురపు సోమేశ్వరరాయకవి

ప్రణీతము

మొ. దటికూర్పు 1,000 ప్రతులు.

ప్రింటర్సు అండ్ పబ్లిషర్సు,

సిటీప్రెస్, కాకినాడ.

1925.

 [వెల రు. 1-0-0:

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

## —♦ పురుషులు. ♦—

1 మహేంద్రుఁడు—స్వర్గాధిపతి.

2 బృహస్పతి—దేవగురువు.

3 జయంతుఁడు—మహేంద్రుని కుమారుఁడు.

4 కచుఁడు—బృహస్పతి కుమారుఁడు. కథానాయకుఁడు.

5 వృషపర్వుఁడు—రాక్షసరాజు.

6 మహాబలుఁడు—రాక్షసమంత్రి.

7 శుక్రుఁడు—రాక్షసగురువు.

8 కరాలుఁడు }
9 నీలుఁడు } శుక్రుని శిష్యులు.
10 ముకుందుఁడు }

మఱికొందఱు హంతకులు, భటులు, సందర్భానుసారముగా ప్రవేశింతురు

## —● స్త్రీలు. ●—

1 దేవయాని—శుక్రుని కుమార్తె.

2 శర్మిష్ఠ—రాక్షసరాజు కూతురు.

3 వళిని—శర్మిష్ఠ చెలికత్తె.

కొందఱు పేరటాండ్రు:—



# ప్రకటన.



ఈనాటకము నాయొక్క వ్రాతమూలమగు ననుమతిపొందనిదే యెవ్వరును ప్రదర్శింపఁగూడదు.

గ్రంథకర్త.

# తప్పొప్పులసవరణ

| పేజీ | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 15 | కీరియును | కీర్తియును |
| 7 | 8 | సుజ్జనకును | సజ్జనునకును |
| 7 | 24 | నాకృతుణంబులో | నాకృతుణంబులోననే |
| 8 | 15 | యద్భుత వృత్తాంతము | యద్భుతోదంతము |
| 9 | 22 | రాక్షసేశ్వుని | రాక్షసేశ్వరుని |
| 11 | 14 | వాడు | వారు |
| 15 | 7 | తాళము మాలిక | తాళమాలిక |
| 34 | 32 | నీను, దాత్మ | నీయు, దాక్మ |
| 46 | 3 | నన్న | నన్న |
| 49 | 11 | నిమిషములో ఏడ్చుచు | నిమిషములో [ఏడ్చుచు] |
| 51 | 13 | పురుషుండెవండన్న | పురుషుండెవండన |
| 51 | 15 | చెందదెవండన్న | చెందండెవండన |
| 52 | 4 | నమబుద్ధి | నమబుద్ధి |
| 52 | 23 | దెంచి | దెగించి |
| 53 | 19 | విధాత మనమడంప | విధాత మదమడంప |
| 59 | 20 | ఆధార మైన | ఆధార మైన |
| 65 | 17 | బండి | బడి |
| 66 | 21 | కలపానమొనర్చి | జలపానమొనర్చి |
| 67 | 13 | కావున | కావ్యని |
| 76 | 21 | గృహముకకరుగుము | గృహమునకకరుగుము |
| 84 | 6 | నేలాభ మో | నేలాభ మా |
| 85 | 24 | రక్షింపమని | రక్షింపుమని |



శ్రీ

# కచ-దేవయాని.

అను

## మృత సంజీవని

ప్రథమాంకము. ప్రథమరంగము.

—* స్థలము:—దేవేంద్రుని కొల్వుకూటము *—

[మహేంద్రుఁడు, బృహస్పతి, జయంతుఁడు యుచితాసనముల
పైనుండఁగాఁ దెఱతీయును.]

మహేం—ఆచార్యోత్తమా !

చ॥ అనిమిషులన్ జయించిరఁట ♦ ముందుఁ ద్రివిష్టపమాక్రమింపఁగా
బనివడి వచ్చెఁగాదె? వృష ♦ పర్వ నిశాచరనేత, వానితో
డను మనసైనికావళి హ ♦ టా హుటి నేఁగతిఁబోరుచుండిరో
వినుచుఁగ నొక్కఁడైన నిటు ♦ వేగుల వాఁడరుదేరఁడేలకో?॥

బృహ—మహేంద్రా !

చ॥ కదనమునన్ జయోన్నతులఁ ♦ గాంచఁబరస్పర శౌర్యవిక్రమా
స్పదులయి యొండొరుల్ పెనసి ♦ ప్రాణభయాలవశూన్యచిత్తులై
పృదులత దేశరక్షణ న ♦ మిద్ధయశోప్తికిఁబోరుచుండఁగా
నదను లభించునే? యుచటి ♦ యంశములన్ గొని తెచ్చు లెంకకున్॥

కావున నేఁడియాలోకంత తెలిసియైనవిమ్మట రణవిశేషములన్నియుఁ దెల్పుటకై యెవఁడోయొకఁడరుదెంచును. దీనికై నీవిట్లు తల్లడిల్లనేల?

మహేం.—గురువరా! ఈనాకలోక పరిపాలన మూనినది మొదలు నాకావంతయేని సౌఖ్యమలవడకున్నయది. ఏవేళకేరాక్షసుండరుదెంచి రణంబొనరించునో యని గుండెలఁ జేతఁ బట్టుకొని యీస్వర్గము బరిపాలింపవలసి వచ్చుచున్నదిగాని:— త్రిలోకాధినాథుండనుగదా నాకేమని నిశ్చింతతో నుండుటకు నోచనైతిని. గురువరా! లోకమునఁ బరిపాలకులు మహాదృష్టవంతులని యనుకొనుచుందురుగాని-నిక్కవముగా నక్షయపాత్రాధికారి కున్న సౌఖ్యములో-స్వేచ్ఛలో-సంతుష్టిలో-ఆనందములో-శతాంశమైననుపోనీ-సహస్రాంశమైనను-రాష్ట్రాధికారికుండియుండదుగ-

తే॥ గీ॥ కడుపునిండుగ నాహార ♦ మిడినయంతఁ
గడు ముదంబందుచుండు భి ♦ క్షుకుఁడుగాని
నూఱురాష్ట్రంబులేలఁగా ♦ నున్న నృపతి
నూటయొకటవదానికు ♦ బ్రూఁటలూరు

పరిస్థితిధర్మమిట్లున్నయది. దానికిఁదోడు:—

సీ. బలశాలులైనట్టి ♦ పరరాజులరుదెంచి
బాధింతురని యెడి ♦ వంతతోడ
సతతంబు పరరాష్ట్ర ♦ సంపాదనము సేయు
టెట్లనిమదిలోభ్య ♦ వృత్తితోడ
లోపంబులనుఁజూపి ♦ లోకులి దేమని
యడుగుదురనెడి భ ♦ యంబుతోడ
కుజనుఁడీతండని ♦ ప్రజలెల్ల రేకమై
చెనకుదురని యెడి ♦ చింతతోడ
తానుజేసిన బహుక్రియల్ ♦ ధర్మమనుచుఁ
గపటవృత్తిని మాయమా ♦ రైక నిరతి
ము క్తియని యెంచుకొనునట్టి ♦ భూమిపతికి
రాజ్యపరిపాలనంబన్న ♦ శ్రమముగాదె?

బృహ—నముచిసూదనా! నిక్కవముగాఁ గుజనుఁడైన ధరణీశ్వరునకివి యన్నియుఁ గష్టములేయగును. కాని:—

ఉ. ధర్మము నాల్గుపాదములఁ ♦ దద్దయునిల్పి ప్రజాళిసౌఖ్యమే
యర్మిలితోడఁ జూచుచు గు ♦ ణావగుణంబుల నేర్పరింపుచున్
గూర్మిని రాజ్యరక్షణమె ♦ గోరి స్వలాభ విహీనుఁడౌటయే
ధార్మికుఁడైనయట్టి నృప ♦ తల్లజమౌళికి ధర్మమారయన్.

అట్టిధర్మమార్గంబులయందు బుద్ధినిఁ జొరనీయక కుటిలవర్తనుఁడై, స్వలాభాపేక్షాపరతంత్రులైనవారి యిచ్చకములాలించి, ప్రజాసౌఖ్యమును బాటింపక, యధర్మప్రవర్తనులై, యిచ్చవచ్చినటు లొనరించు వాఁకులకట్టి మనఃక్లేశములుద్భవించు టాశ్చర్యములోనిదిగాదు.

మహేం—[తలవంకించుచు] తమరుసెలవిచ్చిన యుదంతము సత్యమే గాని—భూభారము వహించి స్వలాభాపేక్షాధురంధరుఁడైన నృపతిధర్మభారము వహించుటకష్టతమము.

జయం—ఆచార్యోత్తమా! ఈనృపవర్యుఁ డెట్టివాఁడు?

బృహ—కుమారా! నృపస్వాఁ డసురవర్యుఁడు గదా? లంకాసంజనితుండగు నాతని సంరంభ మీఱెఱుంగవా?

ఉ. న్యాయమునందు బుద్ధియు, జ ♦ నంబులపైఁదగుఁ బ్రేమ, సంతత
శ్రేయము లిచ్చునట్టియల ♦ శ్రీపతిపైననురక్తి, విప్రులం
దాయతమైన భక్తి, సతు ♦ లందుఁ బ్రిగల్భ్యత, సత్యమందునా
న్యాయము లంకలోజనన ♦ మందినవారలకుండ వెప్పుడున్.

జయం—ఏమీ? లంకలోజననమందినంతమాత్రమున సద్గుణములన్నియు దూరమైపోవునా?

బృహ—కుమారా! సద్గుణంబులనుగాంచి నిశాచరులేదూరముగాఁ బరిక్రమింతురుగాని పలలాశనులంగాంచి సద్గుణంబులు దూరముగాఁబోవవు. చూడుము.

తే. గీ. దుర్జనులు సజ్జనులఁగాంచి ♦ తొలఁగునటుల
నన్నృతవాది సూన్నృతవాది ♦ నరయునటుల

సంబుధులగ్ని తాండవ ♦ మాడనటుల
దైత్యులును సద్గుణంబుల ♦ దరికిఁబోరు.

జయం—బాగు బాగు. రాజుకుటిలవర్తనుఁడై నప్పుడు దేశక్షేమమింక వేఱెయడుగవలయునా?

మహేం—ఆచార్యోత్తమా! పరిపాలనలోపాని. [అర్థోక్తిలోనసే]

బృహ—సరి సరి. నక్కరాయొకచో మూళఁబెట్టి పేఱొకచోఁ గాఁకల్యాణ మెన్నఁటికేని బాడునా? వినుము.

సీ. పన్నులు హెచ్చింపఁ ♦ బ్రజ లెల్లమొఱవెట్ట
చెవియొగ్గి వినక పెం ♦ ఛ్ఛించుచుండు
హెచ్చుపన్నులను మే ♦ మీయలేమని యన్న
జప్తునకాజ్ఞ లో ♦ సంగుచుండు
జల గతోత్కటమహా ♦ కలితభూములకైన
మాములుపన్నులి ♦ మ్మనుచునుండుఁ
బ్రజలెల్లమొఱవెట్టఁ ♦ బాటింప కెదలోన
లంచగొండులమాట ♦ లెంచుచుండు
దనకుఁదోఁచిన దేన్యాయ ♦ మనుచునుండుఁ
బ్రజలుదోప్రిహాత్ములనిసదా ♦ బలుకుచుండు
గుటిలవర్తనుఁడయి మహా ♦ కూళయగుచుఁ
దా జగత్పతిననుచు ను ♦ ద్ధతివహించు.

జయం—ఏమేమీ? అతఁడు జగత్పతియెట్లగును?

బృహ—"నావిష్ణుః పృథివీపతిః" అను వాక్యమాతని పట్లనేపత్రించునట్లు.

జయ—తరువాత తరువాత.

బృహ—తరువాత నేమున్నది?

సీ. శాస్త్రవిద్యాబోధ ♦ జనములకిడిచంత
దనయాటలిక సాగ ♦ వని తలంచి
మైకమత్యము బ్రజ ♦ లందుఁగల్గినమొదఁ
దనమాటఁబాటింప ♦ రని తలంచి

స్వేచ్ఛయొసంగినఁ • జెలరేగి జనములు
దనయానమీరుదు • రని తలంచి
ఖడ్గవిద్యాజ్ఞాన • కాంతులఁ జెల్పినఁ
దనకె మోసమ్మగల్గు • నని తలంచి
శాస్త్రవిద్యను బూర్తిగాఁ • జంపివైచె
నైకమత్యంబు మొదలంట • నణచివైచె
స్వేచ్ఛ లవమైన లేకుండఁ • జేసివైచె
బందకత్రియుఁ జేత లే • కుండఁ జేసె.

జయం—గురూత్తమా! ఇంతదారుణముగా రాజ్యపాలనకుఁ గడంగిన వాని పరిపాలనకుఁ బ్రజలులోనయి యణఁగి మణఁగియుండిరా?

బృహ—కుమారా! ఎట్లుండుగు? వృషపర్వుని దుర్మార్గముల కన్నింటికినిఁ బ్రజలు బ్రతిఘాతముగావింపఁ జూచుచుండిరి. కాని లాభమేమున్నది? సజ్జనులకు దుర్జనులును—మంచికిఁ జెడ్డయును—న్యాయమున కన్యాయమును—సత్యమున కసత్యమును—కీర్తి కపకీర్తియును—ధర్మమున కధర్మమును—జ్ఞానమున కజ్ఞానంబును—ఫుణ్యమునకు పాపంబును—ఎల్లప్పుడడ్డమై యెట్లు నిలుచునో యట్లే యా వృషపర్వుఁ డొనరించు నన్యాయములకుఁ బ్రతిక్రియ యొనరించెడి వారల కడ్డమై స్వార్థలాభపరాయణులు కొందఱు విఘాతములు సేయుచుండుటచే విశేషలాభము లేకుండ నున్నయది. వృషపర్వుఁడు నమ్మకమైనదొంగ కావుననే తనకుపకారమొనరించువారల కేదియో యొక బిరుదుపట్టముంటగట్టియో, లేక వేతనము లేని గౌరవోద్యోగమొసంగియో, సంతోషపెట్టుచుండును. వానినాశ్రయించినవారు స్వలాభాపేక్షాపరులైన గృత్రిమస్వభావులు. అందువలననే ప్రజల ప్రయాశయములు పూర్ణముగా నెఱవేఱకుండ నున్నయవి.

మహే—ఆచార్యవర్యా! అటులైనఁ బ్రజలీతని కనువర్తనులైయుండుటరుదుగదా? తనదేశముననే తనకు వ్యవస్థలేనప్పు డితరులతో యుద్ధమునకెట్లు సంసిద్ధుండగుచుండును?

బృహ —తనయధర్మపరిరక్షణమునకు నాటికిని గాంచున్న నింద్రునకు నాఁటి బరిజాలుంగక మానవదనియు, వట్లత్తింగి తనపైఁ దిరుగుఁబాటొనర్చినచో నాయల్లకల్లోలము లడంచుకొనుటకుఁ జతురంగ బలంబే తనకు ముఖ్యాధారమని తలంచి, తత్సైనికులకు వేతనాభివృద్ధిఁగావించి, వారియనుగ్రహ సంపాదనమొనర్చుకొనియెను. ఇంకనాతనికి లోపమేమి? తత్సహాయంబున నన్యరాష్ట్రంబులు గైవసమొనర్చుకొనవచ్చును తనకోర్కెలీడేర్చుకొనవచ్చును. అంగబలముతోడ నాయుధబలముగూడ తోడైయుండనికఁ గొఱంతయేమి ?

[అప్పుడు యోధుని వేషముతోఁ గచుఁడు బ్రవేశించుచున్నాఁడు]

కచు—[తనలో]

ఉ. ఎంతటిసైన్యమున్నను, మ ♦ రెంతటి శౌర్యబలంబులున్న నిం
కెంతటి ధైర్యమున్న, మఱి ♦ యెంతటి సాహసమున్న నెంచఁగా
నెంతటివానికైనఁ బర ♦ మేశునను గ్రహమింత లేనిచో
నంతయు వ్యర్థమౌనను బు ♦ ధావళివాక్కుల బద్ధమౌనొకో? ౧౧

[శిరఃకంపనమాచరించుచు] ఆమాటయే యథార్థముగాదేని?

చ. కరిబలమా? కనఁబడదు. ♦ కాల్బలమా? తగినంత లేదుం భీ
కరమగు వస్త్రశస్త్రములు ♦ గన్పడవౌర! రథంబులున్మహా
తురఁగదళంబులున్గలత ♦ తోడఁ బ్రవిష్టవ మౌకఁ ప్రిఖింపఁగాఁ
బరువిడివచ్చినట్టి కృప ♦ పర్వఁడనిన్నెల పంగఁ జాలునే ?

ఔరా! ఇట్టియాశ్చర్యకరమగు వృత్తాంతమే నెన్నఁడునుఁగని, వినియుండలేను, [సాభిప్రాయముగా] నేనొక్కండ నేగాదు. ఇది వఱకెవ్వరునుఁగూడ నిట్టియద్భుతోదంతము వినియుండరని యనుకొనియెదను. ఔరౌరా !

చ. రణమునమూఁడు ముక్కలయి ♦ ప్రాణములన్విడవాఁడువారలా
క్షణముననే సజీవులయి ♦ సంగరరంగమునందునిల్చి దా
రుణముగఁబోరుచుండుట త్రి ♦ లోకములందుననెవ్వరేనియున్
గని, వినియున్నవారె? కని ♦ నన్, విననట్టిదు చోద్యమౌఁగదా?

[ఒక్కనిముసమాగి] అదియేమి దైవనిర్ణీతమోగాని నాకర్థము గుటలేదు. రణరంగంబున నిహతుండైనఁ బ్రతిరాక్షసుఁడునుబున ర్జీవితుండయి సమరసంకుల సన్నాహంబొనర్చుచుండుటచేతను, మా యమరులలో మడసినవారు మరలజీవించునంతటియదృష్ట ములేకఁబోవుటచేతను, మాకుజయములభించునని యాశయే యడుగంటుచున్నది. నిశాచరులట్లు పునర్జీవులగుటకుఁ గల కారణంబెయ్యదియో యెఱుంగరాకున్నయది. ఇప్పుడీవిశేషమిా మహేంద్రునకును, మజ్జనకును నివేదించినఁ ద్రికాలవేదియగు నా జనకుఁడు తనదివ్యజ్ఞానమహిమా విశేషంబున కారణముగ్ర హించి దానికిఁ దగిన ప్రతిక్రియ యుపదేశింపవచ్చును. అట్లొన ర్చినఁగాని మాకింకఁ దరణోపాయములేదు కావున సత్వరము గాఁజని యాయంశ మెఱిగించెదఁగాక. [నడచును]

జయం—[ముందునకుఁజూచి] ఇదిగో! పాలికలనుండి విశేషములెఱి గించుటకుఁ గావలయుఁ గచుండరుదెంచుచున్నాఁడు. ఈతనిరా కశుభావహమగుఁగాక.

కచు—[సమీపించి] స్వర్భువనాయకా! జయము జయము. జనకా! నమస్కారము.

బృహ—దీర్ఘాయుష్మాన్భవ తనయా! రణవిశేషంబులేమి?

మహేం—గురునందనా! రణమెట్లుసాగుచున్నది?

కచు—[తలవాంచి] దేవతాసార్వభౌమా! రణవిశేషంబులెఱుంగఁజే యుటకు నాలోనాకే సిగ్గగుచున్నది. ఏమందురా?

చ. రణమన సేమిఁగాఁదలఁచి ♦ రాక్షసముఖ్యుఁడు స్వల్పసైన్యముం
దన వెనువెంటఁబెట్టుకొని ♦ ధైర్యముతో మనపైకి వచ్చెనో
యని యనుకొంటి మా గురువ ♦ మంతయు నొక్కక్షణంబులో
నణఁగె నిశాచరేశ్వరుని ♦ సైన్యమునందలి చిత్రమారయన్.

మహేం—[ఆశ్చర్యముతో] అచ్చటట్టి విశేషమేమి తాఁటసిల్లినది?

కచు—దేవనాథా! ఏమనిచెప్పఁగలను?

తే. గీ. అమరుల నెదిరి బీఱఁగాఁ ♦ సమరఁజేసి
కూళలై వట్టి రాక్షస ♦ కోటికెందు
మరణమనుమాట లేకుండఁ ♦ గరుణతో, లి
ఖించి మనకొంప నట్టేట ♦ ముంచెధాత.

మహేం—[కంపితస్వరముతో] ఆఁ ఆఁ. నిశాచరు లమరులైరా?

జయం—సోదరా! కచా! రాక్షసుల కమరత్వమెట్లు సిద్ధించినది.
మన యమరత్వమెట్లు లంతరించినది. స్పష్టీకరించి చెప్పుము.

కచు—ప్రాగ్దిశాధిపతీ! అవధారు. రణరంగంబున నిహతుఁడైన ప్రతి
రాక్షసుఁడును, మరలసజీవుఁడై సంగరరంగంబున కుఱుకుచుండెను.
గతించిన దేవతల కాభాగ్యము లేకుండుటచే మన కెంత సైన్య
మున్నను నిరర్థకముగాఁ గన్పట్టుచున్నది. ఇట్టి వైపరీత్యము తట
స్థించినప్పుడెవ్వరేమి చేయఁగలరు? దీనికిఁదగు ప్రతిక్రియ యొన
ర్పకపోయినచో మనకుఁ బరాజయము తప్పదు. కావున తమరీ
విషయము విచారణ మొనర్చి కర్తవ్య ముపదేశింపుఁడు

మహే—[విచారముతో] గురూత్తమా! ఈయద్భుత వృత్తాంతమున
కేమి కారణము?

జయ—ఆచార్యోత్తమా! అనుగ్రహించి యీవిపరీతమునకుఁగల కార
ణమరసి, దానికిఁదగిన ప్రతిక్రియకూడ నుపదేశించి మీయను
గ్రహపాత్రులమగు మమ్ము రక్షింపుఁడు.

బృహ—[కొంతవడి దివ్యదృష్టిని దిలకించి] మహేంద్రా!

క॥ కనుగొన "మృతసంజీవని"
యనియెడి ఘనమంత్రరాజ ♦ మా కావ్యుని చెం
తనుఁగల దది కలిగినకా
రణమున మరణింపరయ్యె ♦ రక్కసు లనిలోన్.

మృతసంజీవనీ మంత్రప్రభావ మట్టిదియ. ఈమహామంత్రరాజ మాభార్గ
వునికడఁగలదనియెడి మహౌద్ధత్యంబుననే తగినంత కాల్బలము లేకున్నను
త్రిలోకాధినాథుండవగు నీతో రణమొనర్చుటకు సంసిద్ధుఁడయ్యెను.

జయ—గురూత్తమా! ఆమహామంత్రరాజము మనయనిమిషులలోఁగాని,

లేక యే తపోధనుని చెంతనైనఁగాని లేదా?

బృహ—లేదు లేదు.

మహేం—ఆచార్యోత్తమా! అట్లయినమనకిపుడుకర్తవ్యమేమి

బృహ—[కచునితో] నాయనా! కచా! ఈరణమెంత కాలము వఱకు నిలుచునని యూహించెదవు?

కచు—జనకా! నిశాచరులలో గతియించినవారు బునర్జీవులగు చున్ననుఁ వారిసైన్యము స్వల్పమగుటచేతను, మనయనిమిషులకాభాగ్య ము లేకున్నను, గణనాతీతమగు సైన్యముండుటచేతను రణమింతలో ముగియుననుట కవకాశము లేదు.

బృహ—అట్లయిననో శతక్రతూ! మనకీయాపద గడచుట కొక్కటేమార్గమున్నది. అదియేమందువా? మనలో నెవ్వరినైన నొక్కని నామృతసంజీవనీ మహామంత్రమును బడసిరమ్మనమని యా భార్గవుని చెంతకనుపవలయును. ఆతఁడా మంత్రమును బడసినచో బూర్ణజయము మనము బడయుదుము.

జయ—విరోధిసమాజమువాఁడని యెఱింగి కావ్యుఁడా విద్య నొసంగుట కిష్టపడునా?

మహేం—ఇష్టపడుననుట కవకాశము లేదు. ఒకానొకవేళ మనయదృష్టవశంబున నాకావ్యుఁడంగీకరించినను దైత్యేశ్వరుండడ్డు రాకమానఁడు.

బృహ—లేదు. లేదు. దైత్యేశ్వరుఁడడ్డువచ్చుట కవకాశము లేదు. శుక్రుండు సద్బ్రాహ్మణుఁడు. అదిగాక స్వతంత్రుఁడు. రాక్ష సేశ్వరుని నిగ్రహానుగ్రహములతో నీతనికి నిమిత్తము లేదు.

మహేం—అయినమాత్రమేమిలాభము? తనకు బ్రబలవిరోధు లగు ననిమిషులకావిద్య కావ్యుఁడొసంగునా?

బృహ—ఒసంగితీరును. విరోధియైననుసరియె-విహితుఁడైనసరి యె-అర్హుఁడైనవాఁడాశ్రయించినచో దనకుఁదెలిసినదంతయు వానికుప దేశించుట బ్రాహ్మణధర్మము. అయ్యదివిప్రులకు విద్యుక్తధర్మము. అట్లర్థించినవానికనువగు విద్యలొసంగని ద్విజుండు రౌరవాది మహానర

కలుషమునంబడిపోవును. ప్రబలతేజోమయుండును, తపోవ్రతనియతియుతుండును, సద్బ్రాహ్మణుండును నగు కావ్యుండిట్టియధర్మ కార్యాచరణకుపక్రమించి నిష్కారణముగా నరకకూపమునఁబడి పోవుటకను మతింపఁడు. కావున భార్గవుఁడా విద్యనొసంగునా? యొసంగఁడా? యను సందియము మనకుండవలసిన యగత్యము లేదు. అర్హుఁడైనవాఁడర్థించుటయే తడవు కార్యసిద్ధియగును.

మహేం—అట్లయిననో గురువరా! నేఁడే యొకని నా భార్గవుని చెంతకనుపుదము. ఆమంత్రరాజమును బడయుటకర్హుఁడైనవాఁడెవ్వఁడో తమరే నిర్ణయింపుఁడు. వానిపర్థించియైనను మన కార్యార్థమై బంపుదము.

బృహ—మహేంద్రా! ఎవ్వరైననీ కార్యమునకేము సమర్థులమని ముందునకు రావలయునేగాని మనమే నిర్ణయించుట పాడిగాదు. అందనేకములగు బాధలున్నవి................అవియే యందువా?

సీ॥ తనదారిఁ దాఁబోవు ♦ ఘనుని దుందుడుకుచే
యాపిన శాత్రవు ♦ లాపవచ్చు
దిన్నఁబాధముఁ దెత్రిఁగి ♦ తగదయ్య మీకని
వేఁడిన గ్గురువును ♦ వేఁడవచ్చు
తమకు శాత్రవుఁడని ♦ తలఁపోసి దనుజులు
గొట్టినన్ గుమిఁగూడి ♦ కొట్టవచ్చు
అంతతోఁ బరితృప్తి ♦ నంతకబలిమిని
దీసినన్ బ్రాణము ♦ దీయవచ్చు
అన్నియును దాఁటి భార్గవు ♦ నాశ్రయింప
శిష్యగుణగణములు బరీ ♦ క్షించుదాఁక
గోరినటువంటి విద్యనుఁ ♦ గూర్మితోడ
బోధసేయక పోయినన్ ♦ బోవవచ్చు.

తే॥ కావున నట్టికష్టముల ♦ కైనను నోర్పువహించువాఁడు సు
శ్రీవిభవాభిరాముఁడు వి ♦ శేషగుణంబుగలట్టి ప్రాజ్ఞ ధ
ర్మవనవృత్తులెల్లఁ దెలి ♦ యంగల ధీరుఁడు బ్రహ్మచారియున్
బోవలెఁగాని యన్యులటు ♦ బోయిన లాభము లేదు దానవా!

మహేంద్రా! నేఁ జెప్పినట్టివాఁడు తనంతట దానే మృతసంజీవనీ మంత్రమును దెచ్చెదనని మహాధైర్యంబున ముందునకుఱుకవలయునే గాని మనము గోరుటవలన లాభము లేకపోవుట నరియేగదా నష్టములు గూడ వానియమాయకత్వముచే దాపురించినను దాపురింపవచ్చును.

జయం — కుడిచికూర్చుండ లేక - ఆదనుజుల చెంతకరిగి నిష్కారణముగా లేనిపోని యిడుమలం బడుటకై నను సమ్మతివహించి దేవహితార్థమై బ్రయత్నించు మహాపురుషుండెవ్వఁడు గలఁడు?

మహేం — స్వార్థపరత్వమును వీడి - పరహితార్థమై - అందున దేశహితార్థమై - పాటుఁబడుట కెంతటివారుగావలయును? అట్టివారలిప్పుడున్నట్లుగా దోఁపదు. అదియునుఁగాక ''అడుగనిది మేయమ్మయైనను బెట్టదను నార్యోక్తి స్మర్తవ్యముగునా?

బృహ — మహేంద్రా! ఎన్నఁడట్లు తలంపకుము.

సీ॥ తన స్వలాభము జూచి ♦ కొనక యెవ్వేళను
బరహితార్థము పాటుఁ ♦ బడెడువాడు
సకలసౌఖ్యంబులన్ ♦ సత్వరంబుగ వీడి
దేశహితార్థము ♦ దిరుఁగువారు
ఎట్టి బాధంకైన ♦ నిదినా! దేహంబని
తిరుగక మరిలి గెల్చి ♦ తీరువాఁడు
పరులకోరకమున్న ♦ యరుదెంచి సర్వస్వ
మను జీవమును ధార ♦ బోయువాఁడు
అప్పుడిప్పుడు ననేల ♦ నెప్పుడుండు
రట్టివారలు లేకున్న ♦ నట్టి నెళ
పవలు రేయును భేదభా ♦ వము నశించి
మిగుల సంక్షోభమందవే ♦ జగములెల్ల.

కచ — [బృహస్పతి సమీపమునకరిగి]

ఉ॥ ఏవటుబోయి శుక్రదయ ♦ నెట్టులనో గడియించి నేర్పమై
బూనిక మంత్రరాజమును ♦ బూర్ణముగా గడియించి దెచ్చెదన్

గాన మహాత్మ! నాకుఁగడు ♦ గారవమొప్ప ననుజ్ఞనిమ్ము నీ
మానసమందునక్కటిగులు ♦ మాని, రయంబునబోయివచ్చెదన్.

[అనిమహేంద్రుని వమిూపించి] త్రిలోకాధినాథా!

శా॥ ఆటంకంబులవేమిగల్గినను మీా ♦ యాశీస్సుచే నేర్పుమై
దాటంగాఁగలవాఁడనే ననుమహా ♦ ధైర్యంబునన్ మీారుసా
రాటంబుల్ కనదీర్పఁగాఁగలుఁగు మ ♦ త్రింబుల్ గడింపంగ నా
రాటంబుల్ గననాకుహెచ్చెడిస న్వ ♦ ర్గాధీశ! నన్బంపవే.

కావున తమరీవిషయము యాలోచింపవలసిన యగత్యము లేదు. సత్వరంబమిూయాశీయము దీర్పగలవాఁడను ధైర్యమూనాకు న్నయది మిూరాజ్ఞయొసంగుటయే తడవుగాఁబోయి భార్గవునాశ్రయిం చెద. ఎట్టికష్టంబులైనను భరించెద. విశ్వప్రియత్న మొనరించెద. మంత్రసంపాదన మొనరించెద. మనకష్టంబు లంతరించునట్లొనరిం చెద. మిూకొప్పగాంచెద. కావున సంశయింపకుడు. అవశ్యముపోయి రమ్మనుడు.

మహేం — [సింహాసనము నుండి దిగి కచుని చేయిఁబట్టుకొని] కుమారా! దేవహితార్థమై-స్వారాజ్య హితార్థమై-స్వసౌఖ్యము వీడి-విశేషకష్టములకులోనయి-కావ్యునిచెంతనున్న మృతసంజీవనీ మంత్ర రాజమును తేఁదలచిన నిన్ను సకలశుభదేవతలును శుభదృష్టినీక్షింతురు గాక. నీప్రయాణము ఫలోన్ముఖంబగుఁగాక. నీకోర్కెల్ మాయాశ యమును సంపూర్ణముగా నెఱవేరుగాక. [బృహస్పతిచెంతకరిగి]

ఉ॥ దేవహితార్థమైమిగులఁ ♦ దేఁకువతోడను శుక్రుచెంత సం
జీవని నేర్పుమైయిటకు ♦ శీఘ్రముఁగాఁగొని దెరఁబోయెద
న్గావున నన్నుఁబంపుఁడని ♦ నన్నును మిమ్మునువేడుచుండె మిూ
యీావరపుత్రకుండు, తమ ♦ రిందుల కిప్పుడనుగ్రహింపరే.

బృహ — మహేంద్రా! నీవునన్నింతఁ బ్రతిమాలవలయునా? [తనలో] స్వార్థలాభపరాయణుఁడైయుండక, తనవిద్య-తనతనువు-తన నేర్పు-తనజన్మ పరహితార్థమైవినియోగించి జగద్విఖ్యాతిఁగనఁగలుఁగు మహాభాగ్యంబబ్బినకుమారరత్నము నాకు దయించినందులకు నేనా

సందేహపరవశుఁడనై యున్నాను. నిశ్చయముగా నాజన్మ తరించినది [అని కచుని వెంటఁ దీసికొని పలుకు] నాయనా! కుర్రవాఁడనని భయపడక-రాక్షసుల చెంతకుఁ బోవలయునే యను భీతి లేక-శుక్రుఁడాదరించునో యాదరింపఁడో యను విచారంబు లేక-పరస్థల నివాసమెట్లు చేయుటయా యను సంశయము లేక--దేవకార్యమే ముఖ్యముగా--మృతసంజీవనీ మంత్రరాజ సంపాదనమే పరమావధిగ-బెట్టుకొని-నీప్రాణములు తృణప్రాయములుగ నెంచుకొని--దైవమును నమ్మికొని--సత్యమును నమ్మికొని--ధైర్యలక్ష్మీసమేతుఁడవై శుక్రునాశ్రయింపఁబోవు నీకు సర్వశుభంబులును గలుఁగుఁగాక. నీయాశయము నెరవేఱుఁగాక. తండ్రీ పోయి రమ్ము. మెలఁకువతో కార్యమును సాధించుకొనుము. భద్రము భద్రము.

కచు—జనకా! నాయభీష్టమునకనుగుణ్యముగా ననుమతి యొసఁగిన మీకృపావిశేషంబునకనేకవందనములు. పోయివచ్చెదను. [ఇంద్రునిసమీపించి] త్రిలోకాధినాథా! సెలవొసంగుఁడు. నారాకకొఱకు దండధరుండరయుచుండును అతనికొఱకేకినై సంబంపి నేనిల్లు వెడలితినని తెలియఁజేయుఁడు.

మహేం—కుమారా! నీయెదుటనే యాపని నిర్వర్తించెద. [జయంతునితో] కుమారా! పొలికలనికేఁగి యామ్యదిశాధీశుతో నీయావద్వృత్తాంతము విన్నవించి వానికనుచరుండవై యుండుము పొమ్ము.

జయం—చిత్తము [అని నిష్క్రమించును]

కచు—దేవా! సంతోషము పోయివచ్చెద. [నిష్క్రమించును]

బృహ—మహేంద్రా! కార్యసానుకూలమైనది గావున మనము గూడ బోవుదమా?

మహేం—చిత్తము దయచేయుఁడు.

[నిష్క్రమింతురు]

ఇది ప్రథమాంకము.





శ్రీ

# కచ-దేవయాని.

అను

# మృతసంజీవని

ద్వితీయాంకము.] [ప్రారంభము.

స్థలము:—అరణ్యము.

[ముకుందుఁడొంటరిగాఁ బ్రవేశించుచున్నాఁడు.]

ముకుం—[తనలో] మిట్టమధ్యాహ్నమైనది. సమిత్కుశలకొఱకుఁ బోయినవారెక్కడను గనుపింపకుండిరి. వీరెటువంటివారని తెలిసియే వీరితోనడవికి పోనక్కర్రాబాబూ! ఇక్కడనే యుంటానంటే యాశుక్రాచార్యుఁడు నామాటవినుపించుకొనఁడు. నేనేంజావనా? ఈదిక్కుమాలిన శుశ్రూషచేసి చేయలేకుండాయుంటిని. ఇక్కడనుండి పోదామా యనుకుంటే నాకుచదువబ్బకుండాయున్నది. శుశ్రూషలో లోపముండుటచేతనే చదువురాకుండాయున్నదని యీ ముద్దుదద్దమ్మలంతా యనుకొందురుగాని నిజమునకు దేవయానిమీదనాకున్న విపరీతపుమోహమే నాకుచదువబ్బకుండాచేస్తున్నది. కాని వీళ్లకానంగతి మాత్రము

తెలియదు శుశ్రూషలో లోపమేమిటి వీళ్ళ మొగము...... మొన్న గురువుగారు కాళ్లు పట్టుమంటే తడఁబడఁ గ్రుంకించఁ దలంపి తాళముతో త్రిపుటమిశ్రము జేసి యతిప్పినా చురుకు తప్పకుండా ఝుణాయించి వాయించేసరికి గురువుగారు గుస్సా తిప్పి "అభాగ్యశిరోమణీ చాలురా" అన్నారు. మళ్లీ యెప్పుడూ కాళ్లు పట్టమనలేదు కాని - అంటేనా - సప్త తాళములోక్కూరు ఝుణాయించి కలుమీద ఖంగున మ్రోగేటట్లు తాళము మాలిక వాయించి తీరుదును. అదేమి కర్మమో చెప్పినపని మళ్లీ చెప్పకుండా వున్నారు. చెప్పినపని చెయ్యనకుండా వుండాలి. మళ్లీ సప్త జన్మాలకీ యింకోపని చెప్పకుండా నుండేటట్లు చేసికోవాలి. అవిధంగా జేస్తే తెలివి తేటలుండటకీ యుండునా? ఉండవు, ఉండవు. ఇంతకీ మూలము దేవయానికి అక్కడ చిక్కుపడ్డాను కాని లేకపోతే యీ వెధవబాధలన్నీ నాకెందుకు? [అని యిటునటు జూచి] అదిగో! సమిత్కుశలతో అక్కడ బోయినవారు వచ్చుచున్నారు. వీళ్లతో యాశ్రమమునకు బోతినా మళ్లీ నా జన్మమధ్యమున నడవికి రాను

[నీలుఁడు, కరాళుఁడు అను శిష్యులు సమిత్కుశలతో ప్రవేశించుచున్నారు.]

ముకుం—[ఎదురుగా రెండడుగులు నడచి] మీకీమధ్యతనులు లేకుండా బోయినవి. ఇంత భయభక్తులు వచ్చిపోయినవేమి? ఇంతాలస్యము చేసితిరేమి?

నీలు—నోరుమూసుకొని యీ సమిత్కుశలు పట్టుకొని నడువుము పోవుదము.

ముకుం—[గుండెలు బాదుకొనుచు] ఈ సమిత్కుశలన్నీ నేనొక్కడను బట్టుకొనఁగలనా? కొంచము సద్దుకొనుఁడు

[అప్పుడు సామాన్య వేషముతోఁ గచుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కచు—[తనలో] ఈ మహారణ్యమునకంతు లేనట్లున్నది. ఎంత నడచినను దరుగుఁ విరుగు లేకుండ నున్నయదే. శుక్రాశ్రమమెక్కడ నన్నదో యెట్లుపోవలెయునో సెలవిచ్చువారెవ్వరును లేరు. ఇప్పుడేమి చేయుదును? [అటునిటు జూచి] అదిగో! అచ్చట నెవ్వరో మువ్వురు

పురుషులుగాగ్రహించుచున్నారు వారు శుక్రాశ్రమమునకు దోవ జూపించెదరేమో పోయి యాచించెదగాక [అని సమీపమునకరిగి] సోదరులారా! ఎఱింగితిరేని శుక్రాశ్రమమునకు మార్గమెఱింగించి పుణ్యముగట్టుకొనుడు.

ముకుం— ఏమినాయనా! నీకు శుక్రాశ్రమముతో బనియున్నదా? ఆచార్యునితో బనియున్నదా?

కరా— ముకుందా! నీవకపుబుద్ధిపోనిచ్చుకొనవుగదా? మాటాడకుము

నీలు— అయ్యా! తమనామధేయమేమి?

కచు— కచుడందురు.

ముకుం— సార్థనామధేయుడవా నాయనా? అంతకంటె కొంత చుండనిన బాగుండునేమో జూచుకొనుము. పేరుమార్చుకొనుటలో దోషము లేదులే.

కరా— ముకుందా! నోరుమూసుకొనుము. అయ్యా! తమకా వృశనునితోగల కార్యమేదియో యెఱుంగవచ్చునా?

ముకుం— [కచునితో] ఏమయ్యా ఈశమిత్కులు నీవుమోసుకొని నావెంటవచ్చినచో నేను త్రోవజూపించెదను.

నీలు— ఛీ ఛీ! మాటలాడవలదని చెప్పలేదా?

కచు— మీ రెవ్వరు?

నీలు— మేమాయన శిష్యులము

ముకుం— నేనుమాత్రమాయన ప్రియశిష్యుడను.

కచు— అట్లయిన సంతోషము. నేనువారి శుశ్రూషజేయ వలయుననెడి కుతూహలముతోడనే బయలుదేరి వచ్చితిని.

నీలు— చాలసంతోషము. మేమిప్పుడాశ్రమమునకే బోవుచుంటిమి. మావెంటరండు.

ముకుం— కచా! నీవు క్రొత్తశిష్యుడవుగావున మునుముందు శుశ్రూషప్రారంభింపుము. ఈసమిత్కులు పట్టుకొమ్ము.

కచు— సంతోషము. [అని పట్టుకొనిపోవుచుండగా]

నీలు—వలదు. వలదు. మీకేలనీశ్రమ.

ముకుం—శ్రమనేనొక్కడనుబడవలయునా? విద్యనారంభించుటను నేర్చుకొనవలయునుని? ఎంతగడుసువాళ్లురానాయనా! [అనికచునితో] ఏమయ్యా! పట్టుకొనెదవా? లేదా?

కచు—సోదరులారా! నాకేమియుశ్రమలేదు సరిగదా నాకట్టి భాగ్యమయాచితముగా జేకూరనున్నదని యుత్సాహపడుచున్నాను?

కరా—నీయుత్సాహమునకు మేమేలనడ్డురావలయును. అట్లయిన బోదము రండు. [నిష్క్రమింతురు.]

విష్కంభము.

## ప్రథమరంగము.

—♦ స్థలము:— శుక్రాశ్రమము ♦—

[దేవయానియు, శర్మిష్ఠయు నిరుపార్శ్వంబులంగూర్చునియుండ శుక్రుఁడును. వలువురుశిష్యులను నుండఁగాఁ దెఱలేచును. ]

శుక్రు—మందపాలా! ముకుందాదులెచ్చట?

మంద—సమిత్కుశలకొఱకు బోయినవారింకను రాలేదండి.

శుక్రు—కారణమేమై యుండునో?

మంద—రెండవకారణమేమియుండును? కోతికొమ్మచ్చియో, గోలీబిళ్లయో యాడుకొనుచు బొద్దుపోవుటగూడ గమనింపకుండ నుందురు.

శుక్రు—ముకుందునిమూలముగా మిగిలినవారుగూడ చెడిపోవుటకు గారణమగుచున్నది. పాఠశాలనుండి యాతనినిబంపివేయుదమనుకొనినను బ్రిధానమంత్రికోరికపై యట్లాచరించుటకవకాశము గలుగకుండ నున్నయది.

[సమిత్కుశలు భుజముపై నిడుకొని కచుఁడును, ముకుందుఁడును, నీలుఁడు, కరాళుఁడును బ్రవేశించుచున్నారు.]

దేవ—(తదేకదృష్టితో జూచుచుఁదనలో) ఈశోభనాకారుండెవ్వఁడై యుండును?

శర్మ— (సందేహముతో) ఈతఁడెవ్వఁడో?

కచు— (సమిత్కుశాదులొకచోఁ బెట్టి శ్రమాపనయనం బొనర్చుకొనును)

దేవ— (ఆప్యాయముగాఁ జూచుచుఁ దనలో)

తే॥ గీ॥ శ్రీరమా పుత్త్రునిఁదొల్త ♦ సృష్టిఁజేసి
యంతమాత్త్రాన సంతృప్తి ♦ నందలేక
నించువిల్కాని నందాన ♦ మించునట్లు
బజుఁడు వీనిని సృష్టించె ♦ ననిదలంతు.

అట్లు లేగాకున్న నీతఁడిట్టి సురూపసుందరుఁడై, సుదవతీమన్మథుఁడై, యలరారుట కేమి కారణము? [ఒడలు జలదరించుకొని] ఔరా! ఏమిది? పరపూరుషుండని యెడి సందియంబైననులేకుండ నీతని సుందరాకారంబును దనివారఁగాంచుమని మదీయాంతరాత్మ తొందరబెట్టుచున్నయదే. [కొంత తడవు క్షణక్షణముసుఁ జూచుచు] ఓహో హో! ఏమి యాశ్చర్యము. చూచినకొలఁదియు నీతని సోయగ మపారమై యద్భుతమై గన్పట్టుచున్నయదే. [ఒక్కనిమిషము తదేకదృష్టితోఁ జూచి శిరఃకంపన మాచరించుచు]

ఉ॥ ఎయ్యెడనుండి యెందుకయి ♦ యిందుల కీసుకుమార సుందరుం
డొయ్యన నేగుదెంచెనొ నితఁ ♦ డోరిమితోడ సమిత్కుశాదులం
జయ్యననిట్లు మజ్జనకు ♦ సన్నిధికిఁ గతిఁదెచ్చియుంట కిం
కెయ్యది హేతువో తెలియ ♦ సేరకయుంటి నదెంత జూచియుం.

హృదయమా! తత్తరపడకుము. ఈతని ముఖంబుననే యాతని యాగమనవిశేషంబరయుదువుగాక.

కచు—[ఆచార్యునిఁ జూచి తనలో] ఓహోహో! ఈమహానుభావుఁడు కేవలము మూర్తిభవించిన సత్యదేవతవోలె గాన్పించుచున్నాఁడు. సకలవిద్యావిశారదుఁడగు నీతని దర్శించుటచే నాజన్మము ధన్యమయినది. నాకులము పావనమయినది. [పరికించిచూచి] గురువుగారేదియో దీర్ఘాలోచనాపరులయి యున్నట్లున్నారు.

శుక్ర—[ముకుందునితో] ముకుందా! ఈనూతన పురుషుం డెవ్వఁడు?

కచు—[తనలో] ప్రదక్షిణింగించుకొనుట కిదియే మంచిసమయము. [చేతులుజోడించి ప్రకాశముగా]

తే॥ గీ॥ అఖిల లోకోత్తరుండైన ♦ యంగిరసుని
మనుమఁడ, సురగురు ♦ పుత్రకుండ
నతులితంబగు భక్తితో ♦ నిన్నుఁగొలువ
వచ్చియున్నాఁడఁ గచుఁడను ♦ వాఁడ నేను.

మహానుభావా!

సీ॥ ఎవ్వాని కరుణచే ♦ నీలంక యున్నట్లు
నిఖిల సంపదలతో ♦ నెగడుచుండె
నెవ్వాని కరుణచే ♦ యీదానవులెల్ల
హాయిగా సుఖియింప ♦ నగుచునుండె
నెవ్వాని కరుణచే ♦ వృషపర్వుఁడీతావు
నేలను నిశ్చింతతో ♦ నేలుచుండె
నెవ్వాని కరుణచే ♦ నిట్టి రణోర్విలో
నసురకోటికి జయ ♦ మబ్బుచుండె
నట్టితమరొక్క నత్కృప ♦ నందఁగోరి
దివిజలోకంబునుండి నే ♦ దెంచినట్టి
దేవగురు పుత్రుఁడంతేని ♦ భావమలర
వందనముజేయుచున్నవాఁ ♦ డందుకొనుఁడు. [నమస్కరించును]

శుక్రు—దీర్ఘాయుష్మాన్ భవ. కుమారా! ఇటఁగూర్చుండుము.

కచు—చిత్తము [అనికూర్చుండును అందఱునుఁగూర్చుండురు]

శర్మి—[తనలో] శాత్రవలోకములోఁ నిర్భయముగా బ్రవేశించిన నీతఁడెంతటి ధైర్యవంతుఁడోగదా?

శుక్రు—[తనలో] ఏమిది? నావాచస్పతికుమారుండేమి? నాకడ కరుదెంచుటయేమి? చోద్యముగా నున్నదే? మాకును మాకునుఁ గల పరస్పరవైరమునైననుఁబాటింపక తనకుమారుని య్యెడ కిప్పుడను పుటలో నాయనిమిషాచార్యుని యభిమతమేమైయుండును [తలబంకిం

చుచు] కారణమూహింపఁజాలకున్నాను. [ప్రకాశముగాఁగచునితో] కుమారా! నీజనకుఁడు నిన్నిప్పుడియ్యెడ కెందులకై బంపెను?

దేవ—[తనలో] ఇప్పుడీ పురుషావతంసుఁడేమి సమాధానం బిడునో వినవలసియున్నది?

శుక్ర—[తనలో] తనకుఁ బ్రబలవిరోధియగు బృహస్పతికుమారునిపై యిమ్మహానుభావునకింతటి యనుగ్రహమెందుకో?

కచు—[వినయముతో]

మ॥ కరుణాసాగర! నేను మజ్జనకు నా • జ్ఞన్బొంది సద్భక్తి ని
ష్ఠురయుంగాఁ జనుదెంచితిన్ సకలవి • ద్యల్ నేర్వఁగానెంచి, నన్
జెరవాడంచుఁదలంచి పొమ్మనక సం • ప్రీతిన్ మహోదార! యా
దరభావంబున శిష్యుఁగాఁగొని నను • ద్యల్లీలనఁ బ్రోవవే.

దేవ—[సంతోషముతోఁదనలో] ఇందులకు మజ్జనకుండనుమతించును గాక.

శుక్ర—[సందియముతోఁదనలో] గురువుగారీతని యునికి కనుమతించినచో నాకేమైన ప్రమాదము రాదుగదా? [శిరఃకంపన మాచరించుచు] కానిమ్ము ఇందులకు గురువుగారేమనియెదరో వినెదఁగాక.

శుక్ర—[తనలో] ఏమిది?

చ॥ సురగురుసూనుఁడంట! ననుఁ • జూడఁగ నిట్లరుదెంచెనంట! న
న్గురువుఁగఁ గొల్చునంట! జన • కుండును సమ్మతిఁజూపెనంట! య
చ్చెరువుదయించెడిన్మదికిఁ • జెల్లరె! నన్ బలవద్విరోధిఁగా
దరసెడివాని పుత్త్రుఁడిటు • లద్భుతమొప్ప వచించుచుంటచేఁ.

ఇందేదియో యత్యద్భుతంబగు నుదంతముండి తీరవలయును. కాదేని వాచస్పతియేమి? తనకుమారుని విద్యార్థిగా నాకడఁకుఁబంపుట యేమి? [సందియముతో] సర్వవిద్యాపరిపూర్ణుండగు గీష్పతి తనకుమారుని విద్యకొఱకై రాక్షసులకడకు—అందునఁ బ్రబలవిరోధినగు నాకడకుఁ బంపించునా? అట్లుపంపించినచో-[సందియముతో] పంపించిన నేమి? [ఆలోచించి] పంపించినవారికి గౌరవలోపముగాదా?

[నిదానించిచూచి] నిక్కముగనిందులో గౌరవలోప మెంతమాత్ర
మును లేదు. ఏలయన:—

తే॥ గీ॥ తమపరస్పరవైరంబు ♦ తలఁపునిడక
నెరిచె నట్టికార్యము ♦ దెప్పుడటుల
దీర్చికొనన్యాయమో యట్లు ♦ తీర్చికొంటఁ
బ్రాజ్ఞులకు లక్షణంబని ♦ పలుక వినమె?

ఈన్యాయవాదలోఁదలంచి వివేకశాలియగు నాబృహస్పతి తన కుమారునినిచటఁ బంపియుండవచ్చును. దీనసందియమేమి లేదు కాని— [సంశయముతో] విరోధిపుత్రుని శిష్యునిఁగాఁ బరిగ్రహించితినని వృషపర్వుఁడేమని యనుకొనునేమో? ఏమనుకొనును? తనకిందు నష్టమేమున్నది? [ఆలోచించుచుండును]

కచ—[వినయసంభ్రమములతో] ఆచార్యోత్తమా! "మహానర్ఘాంగీకారమ్మ"ను నార్యోక్తిప్రకారమిప్పుడు నాయభీష్టంబెఱింగియు మారుపలుకకునికి నన్ను శిష్యునిఁగాఁ గైకొన సమ్మతివహించెదరని సంతసించుచున్నాను. కాని మీయమృతవాక్యములచేఁగూడ నన్నానందింపఁజేయఁగోరుచున్నాడను. మహాత్మా!

సీ॥ తమకు నాప్రియమైన ♦ తండ్రికిన్ బూర్వంబు
గలయట్టి వైరమ్ము ♦ దలఁచుకొనక
యిమ్మాశ్రయించిన ♦ మేటి గాఢవక్కోటి
కే నమితుఁడనని ♦ యెంచికొనక
మనవైరులకువిద్య ♦ లనుఁగూర్పఁదలఁచుట
న్యాయమా యనుచు రా ♦ జడుగునవక
పతితపావనమైన ♦ బ్రాహ్మణధర్మంబు
వృద్ధిఁజేయునకు నయి ♦ విడిచికొనక
నీతిసంపన్న! సత్య సం ♦ స్థేయకాయ!!
పరమపూరుష!!! సద్గుణా ♦ భరణహృదయ!!
యేనుఁగోరిన కోర్కె నా ♦ కెలమిగూర్చి
పుణ్యమార్గంబు ననుఁబ్రోమ్ము ♦ పూతచరిత!

తండ్రీ! అనుగ్రహింపు మనుగ్రహింపుము.

ముకుం—ఏమయ్యో! “పిట్టకొంచము కూతఘనము” అను సామెత నీదగ్గ ఱనిజమైనదా యేమి? నీకు విద్య చెప్పవచ్చునో చెప్పఁగూడదో? గురువుగారికి కూడా తెలుసునా, నీవు ఝామాయించి యడుగగానే గురువుగారు నీ తెలివితేటలకు నంతోషిస్తారనుకుంటివిగాఁబోలు. ఎవరికి యే యే విద్య చెప్పవచ్చునో? యే యే విద్య చెప్పఁగూడదో వారెఱుంగుదురు. ఆలోచించుచున్నారుగదా? అందాకా కాస్త నిదానింపుము.

నీలు—ముకుందా! అందరకును సమానమగు విద్యయేగాని—యీ విద్య యొకరికని—ఆ విద్య యొకరికని పుట్టినదా?

ముకుం—ఇదివరకుఁ బుట్టలేదుగాని—యీమధ్య పుట్టినది.

నీలు—[చిఱునగవుతో] ఎప్పుడు పుట్టినది? ఎట్లు పుట్టినది? ఎందులకు బుట్టినది?

ముకుం—ఎప్పుడు పుట్టినదా? స్వర్గలోకము మనమాక్రమించుకొనవలయునను బుద్ధి యెప్పుడు బుట్టినదో యప్పుడు పుట్టినది. ఎట్లు పుట్టినదా? మన రాజుగారు తీర్మానము చేయుటచేతఁ బుట్టినది. ఎందులకుఁ బుట్టినదా? లోకమున మనకంటె దెలివితేటలయిన వారు లేకుండఁ జేయవలయునని పుట్టినది. కత్తి వాఁడిపోతె యుట్లు పనిగెడవేమి? వీరు స్వర్గలోకవాసులుఁగదా? వీరా లోకము విడచి యేలోకమునకు వెడలఁగూడదు, ఎవఁడైనను గర్మము చాలక వెడలినను జిల్లిగవ్వకు మారకూడదు. మనము వీరికి శాశ్వత యధికారులముగనుక ముందట్లు జేయవలయునని రాజుగారును మంత్రులునుఁ గలసి యాలోచించినారు. అట్లు చేయకపోయినచో వీరు మనలను బ్రతుకనిచ్చెదరా? కనుక వీరికి తెలివితేటలు వచ్చే విద్య చెప్పఁగూడదు. బానిసపని విడచిపెట్టినచో బ్రతికేవిధం లేని చదువు చెప్పాలి. మా వాఁడు గొప్ప చదువు చదివెనని సంతోషించుటలో గలయంతరార్థ మిదియే యెట్లాగతివా? సత్య మసత్యముగాను అసత్యము సత్యముగాని మార్చఁగలడన్నమాట. స్వలాభాపేక్షాపరుఁడై నాఁడన్న మాట. కృతఘ్నుఁడై నాఁడన్నమాట, ధనమునకును, రాజునకును, బానిసపనికిని, బిరుదులకును, దాసుఁడై నాఁడన్నమాట.

కారము జేసినవాఁడ వగుదువుగదా యని యూహించి—వివేకముతోఁ దనే యీకార్యముఁ జేసితినిఁ గాన నేనవివేకినిగాను సరిగదా ముందువెనుకల యోక నన్ను వివేకియని సంబోధించిన నీవేయవివేకిని యైపోయితివి.

దేవ—ఓ మందబుద్ధీ! ముకుందా!! ఇటువినుము. అతఁడు దేవతలలోనివాఁడుఁ గదా? దేవతలకును మనకును బ్రబలవిరోధముగదా? ఇట్టివాఁడని మొదటంగనిపిమ్మట యిష్టమున్నచో విద్యయొసంగదరు. లేకున్నచో బొమ్మనియెదరు. ఇప్పుడట్లుఁ బొమ్మనుట కవకాశము లేకుండ-గురువుగారికి స్వేచ్ఛాభంగ మొనరించి-వారివాగ్బంధన మొనరించి-మునుముందీ మహాభాగునిచే శుశ్రూషఁ జేయించి-గురువుగారికతనికి ఋణపడునట్లొనరించి-ఇప్పుడేదో విధముగాఁ జేసినదోషము సమర్థించుటకైఁ బ్రయత్నించుచున్న నీవవివేకివిగావా? నీయొనర్చిన యీయవివేకకార్యమువలన నిష్టమున్నను, లేకున్నను, గురుగారతనిని శిష్యునిఁగా బరిగ్రహింపక తప్పనియటు లొనరించితివే.

కచు—గురుపుత్రీ! నిష్కారణ మీతనినేల నిందించెదవు? విద్య నేర్చుకొను భాగ్యమున్నను, లేకున్నను శుశ్రూషఁ జేయుటకైనను గల్గునని యాశతోడ నేనేయీకార్య మొనర్చితిని. భార్గవునకు నా యెడననుగ్రహముగల్గిత మశిష్యునిగా బరిగ్రహించిన మంచిదే. లేకున్న వారిసేవనీవిధముగానైనఁ జేసెడిభాగ్యంబాదవె నసెడి సంతుష్టితో గురువుగారియాజ్ఞఁబడసి గృహోన్ముఖుండనయ్యెద. ఎట్లయినను మంచిదే. ఇదినామనఃపూర్తిగా నొనరించిన కార్యముగావున నిష్కారణమాతనిని నిందింపఁదలంపకుము.

దేవ—[తనలో] ఏమిది? ముకుందునకు బుద్ధిగఱపు నెపంబున—యీతఁడు మునుపే—యీనవమన్మథాకారుని—యీయపురూపసుందరాకారుని—యీశతమన్మథునిని—శిష్యునిఁగాఁ గైకొనక తప్పదని..మజ్జనకునకుఁ బ్రబోధంబు సేయఁదలంచుటే మహాభాగున కర్థముగాలేదా? లేక—హృదయంబునందలి యభిప్రాయంబను గొనినట్టుల లక్షింపలేనిదువ్య—మోహి మామనోగతాభిప్రాయంబున కనువగు వాక్యంబులు నానోట నుండి రాలేదా? ఏమయియుండును?

యిడియు నదియును ననసేల • నెంచిచూడ
నొక్కటైనను సద్గుణ • మున్నదొక్క
యిట్టి దుర్మార్గులకు శ్రీయు • నెట్లుగూర్చ
నాదిదేవుని యభిమత • మరయనేమొ?

(శిరఃకంపనమాచరించుచు) ఇంకను వీరిపాపసంచయము పూర్తికా లేదేమో? కాదేని పరమేశ్వరుండిట్టి పాపచిత్తులనుక్షమించునా? వారి వారి పాపసంచయముపూర్ణముగా ఫలించువఱకువారు కనులుగాన కిట్లుసేబ్రివర్తింతురు. కానిమ్ము పాపపుణ్యంబులరయు భగవంతుడే యిట్టిదుర్మార్గుల నణప వలయునుగాని తదితరులకు సాధ్యమగునా? [ముందునకుజూచి] ఓహో! నేనీయున్మాదావస్థలోబడి ప్రకృతము మరచితిని. దేవయానిగోరినపుష్పంబులకై వెడలియింతదనుక రాకుండు టకేమనియనుకొనుచున్నదో? త్వరితగతింబోయి యీపుష్పమునామె కొసగెదగాక. [నడచును]

దేవ—[కచునిజూచిడిగ్గునదిగి చెంతకరిగి చిఱునగవుతో] ఇంతయాలశ్యంబైనదేమి?

కచు—ఆలశ్యమునకు విశేషకారణమేమియులేదు. నీకోరిన సుమరాజములివిగో గైకొనుము

దేవ—[ఆప్యాయముగాదీసికొని యాఘ్రాణించి] వచ్చెదనిం దేయుండుడు. [అని నిష్క్రమించును.]

ముకుం—[అపవారించి శర్మిష్ఠతో] సోదరీ! చూచితివా? దేవయాని విపరీతచర్య.

శర్మి—[అపవారించి] అగునగును. దేవయానియీతనినివరించి నట్లేయున్నది సుమా?

ముకుం—[అపవారించి] కాకున్న నీవిపరీతచర్యలేమి? దీనికి మనము విఘ్నమాపాదింపవలయును.

శర్మి—[అపవారించి] అట్లనే చేయుదము కాని-మాటలాడకుము దేవయాని వచ్చుచున్నది.

[అప్పుడు దేవయాని యొక్క శృంగారముతోఁ బ్రవేశించి]

దేవ—దీనినిఁగైకొనినచో విరాళి మనసపనయింపఁగలదు. తీసికొనుడు.

కచు—[తీసికొనక యే] ఏమది?

దేవ—పుష్పాసవము

కచు—[ఆశ్చర్యముతో] సురయా?

దేవ—అగును. ఏమట్లు విపరీతముగా జూచుచుంటిరి? దీనిసంగతి తెలియంగలేదా? తెల్పెదనాలకింపుడు.

కచు—[మందహాసముతో] వలదు. వలదు. దీనిసంగతి నీకంటెనాకెక్కువ తెలియును. తెలియనిదాని నేనే తెల్పెదనాలకింపుము.

దేవ—[చిఱునగవుతో] ఇంతకన్నఁ గావలసినదేమి? అవహితనై యున్నాను.

కచు—గురుపుత్రీ!

చ॥ సురఁగొనునంత కాలమతి ♦ చోద్యముగాఁ గృశియించుచుంట, పే
రురము దపించుట, కడు ♦ నొప్పగు జ్ఞానము డంగుచుంట, లో
ని రుధిరమంతయు న్నెడుట, ♦ నీరస మెచ్చుట, శీర్షమెప్పుడుఁ గా
గిరగిర తిర్గుచుంటయును ♦ నీరజనేత్రి! యెఱుంగఁజాలవో?

సురాపానభావ మవర్ణనీయమైనది. ఇంకను జెప్పెదనాలకింపుము.

సీ॥ పదిమంది పెద్దల ♦ పజ్జకుఁ బోనీయ
దాత్మబంధులనైన ♦ నరయనీదు
అదిమంచి యిదిచెడ్డ ♦ దని యెంచఁగానీయ
దాలిబిడ్డల క్షేమ ♦ మరయనీదు
సిగ్గెగ్గులనువాని ♦ చెంతనుండగనీదు
దాత్మగౌరవమించు ♦ కరయనీయ
దత్య శాంతంబులఁ ♦ బరసకు రానీయ
దలవంశ మర్యాద ♦ లరయనీదు
చెంతకొక మంచిగుణమైనఁ ♦ జేరనీదు
దేహినిటువంటి యజ్ఞాన ♦ తిమిరమందు

గూల్చినై చెడి మఱియెంత ♦ గొప్పదగునొ?
తేటతెల్లంబుగా నీవు ♦ తెలిసికొనుము.

దేవ—[నిశ్చేష్టయైయట్లనేనిలువంబడి] సురాప్రభావమింకను వినవలతును.

కచ—సంతోషము. గురుపుత్రీ! ఈసురాపానదురాచారమును గుఱించి వినియెడివారున్నచో నహోరాత్రంబులేక దీక్షతో మూఁడు దినంబులైనను జెప్పవచ్చును.

దేవ—[ఆశ్చర్యముతో] ఎంతచోద్యము. వినియెడివారే లభింపరా?

కచ— అదియేయిప్పుడాకాశకుసుమమైపోయినది. ఏమందువేని యిప్పుడు సురాపానమొనర్పనివారువేయింటికొక్కరైనఁగలరా? లేరా? అపదీర్ఘముగానాలోచింపవలసినయగత్యమరుదెంచినది. పూర్వముదక్కువజాతివారు మాత్రమే—అందునను విద్యాజ్ఞానమెఱుంగని మూర్ఖులుమాత్రమే సురాపానమొనర్చెడివారు. ఇప్పుడన్ననో అగ్రజాతివారుకూడ సంపూర్ణవిద్యావంతులుగూడ సురాపానాభిలాషులై యున్నవారు. నీవు బ్రాహ్మణపుత్రికవుగదా? నీజనకుఁడు సర్వవిద్యాపరిపూర్ణుఁడుగదా? మీరిరువురునుఁగూడ సురాపానమొనర్చుటలో సర్థమేమున్నది? ఇందేదియో మహాభాగ్యమున్నదనుకొని యొకరిఁజూచి యొకరుదిగిరి. అది తుదకు నాగుపాశమువోలె మెడకుఁ జుట్టుకొనిపోయినది. ఈవిషయము మద్యపానాసక్తులకును దెలియును. కాని దానిపై మమత్వమునువిడువలేరు సరిగదా? పరులెవ్వరైనను వలదని బోధింతురేమోయని వారిని డాయవెఱచెదరు.

తే॥ గీ॥ మూఁడు చుక్కల కొల్లలో ♦ మొదలువెట్టుఁ
దుదకు గూనల కొల్లకుఁ ♦ దోవఁబట్టు
నెట్టివ్యసనంబునైనఁ బో ♦ గొట్టవచ్చుఁ
గాని, మద్యపానముపీడఁ ♦ గాఁదరంబొ?

కావుననే దీనిని పిశాచిగణములో లెక్కించిరి. ఒక్కప్రయత్నమువలన పిశాచమునైనను విదళించుకొనవచ్చునుగాని దీనినివదల్చ

కొనుట మనతరముగాదు. అభ్యాసముజేయుటయే మనవంతు. తరువాత మనయత్నములేదు.

దేవ—మిక్కిలి శ్రద్ధాభక్తులతో నేను వినియెదను. ఇఁకను నాకెఱిగింపుడు.

కచు—సావధానచిత్తవై యాకర్ణింపుము.

సీ॥ కోటీశ్వరునినైనఁ ♦ గుఱ్ఱిడ్డిగవ్వయు లేని
నిరుపేదఁ గాఁ జేసి ♦ నీచుఁ జేయుఁ
దనకుఁ దోడైయున్న ♦ తక్కినవ్యసనముల్
దగిలించి మానవు నే ♦ నొగలఁ జేయు
కలసౌఖ్యములనెల్ల ♦ గంగకర్పణఁ జేసి
తీరనిపిచ్చి యె ♦ త్తింపఁ జేయు
నాకలిదప్పిక ♦ లడగించి ఋణముగాఁ
దనబానిసీఁ గాఁ ♦ దనరఁ జేయు
సరసి మన మనస్థిమితంబు ♦ నడఁగఁ జేయు
దానిగడియించుటకుఁ దలఁ ♦ పూనఁ జేయు
నార ! పుష్పావమహిమ ♦ మద్భుతంబు
దానిచెడుఁగులు వర్ణింపఁ ♦ దరమె మనకు.

అటుపైన:

సీ॥ సుర యావహింపంగ ♦ జూదంబుపైనాస
వ్యభిచారముఁ గోర్కె ♦ వదలనీదు
దానికి సరిపడు ♦ ధనము లేకుంటచే
జోరత్వమున బుద్ధిఁ ♦ జొనుపుచుండు
ధనమార్జనముఁ జేయఁ ♦ దగినన్ని విధములఁ
బాపకృత్యములకుఁ ♦ బాలుఁబఱచు
నరహత్యలొనరించు ♦ న్యాయంబువర్జించు
చిన్నపెద్దలభేద ♦ మెన్ననీదు
కారణములేనిక్రోధంబు ♦ కలుఁగఁ జేయు
లేనిపోని విచారము ♦ నూనఁ జేయు

తుంటరితనంబు పెచ్చింప • వెటబడును
మధురరసమున్న భూతమా • మగువమున్న.

సురాదేవి నర్చించువాఁడెంతటికైనను సమర్థుండగును. లోకమంగళము సురాతిశయమహిమ తుదకు మద్యపానమహాత్మ్యమువలన మత్తెక్కి యొడలు తెలియక సప్తసముద్రంబులేటికి మద్యంబుతో నింప కుప్పనీటితో నింపితివని విధాతపైఁ గోపపడును తిట్టును. కనఁబడినచో నటికి తీసుదునని కత్తినూరును; విష్ణుదేవుని లీలనైనను లెక్కసేయఁగలమేమో గాని పానప్రమత్తచిత్తుండగు వానిచర్యలు మాత్రము వర్ణింప వేయి నాల్కలుగల పాపఱేనికైననుఁ దరముగాదు. దీనియందింకొక చిత్రమున్నయది. అదియేమందువా? మద్యపానం బొనరించువారలకు మతి చలించిపోవుట సహజముగదా? అన్ని విషయంబులయందును మతి చలించిపోవునుగాని మద్యమును సేవించుటకుమాత్రము మామతియట్లనే నిలిచియుండును. దానిని సేవించుటలో మితియు, మరియుఁగూడ లేదు. అట్టిసమయంబున నెవ్వరెటుబోయిననుసరియే. బంధువులేమైపోయినను సరియే. కులగౌరవము కూలిపోయిననుసరియే. ఆత్మగౌరవ మడుగంటిపోయిననుసరియే. తనకొంప నాశనమైపోయిననుసరియే. తనకున్న సర్వస్వములు దరలించుకొనిపోయిననుసరియే. వర్షములు కురిసినను సరియే. కురియకున్నను సరియే. సూర్యుఁడుదయించిననుసరియే. యుదయింపకున్నను సరియే. రాజాధికారులు వేధించుకొనితినిననుసరియే. రాజన్యాయముల కొడిగట్టిననుసరియే. వేయేల-తుదకు ప్రపంచమంతయు బుడుంగున మునిఁగిపోయిననసరియే గాని సురాభాండము మాత్రము మాతనిచెంత భద్రముగా నుండవలయును. అదిలేకున్న నాతనికి సంతృప్తి లేదు. సురయం దిట్టియత్యద్భుతమహాత్మ్యమున్నదని యెఱింగియే మీరాజీ మద్యపానాసక్తిని రహస్యముగాఁ బురికొల్పుచుండెను. సురాపిశాచమునకు దాసులైనవారికి యుక్తాయుక్తజ్ఞానము నశించును. సురాపానాభిలాషుల నేయాప్తమహాపురుషుఁడు గౌరవించుచుండునో యెఱుంగుదువా? తానేమన్నను సరియే—తనయుద్యమమున కనుగుణ్యముగా నీసురాపానాభిలాషు లానవాలపైఁ గూర్చుండి తనువుమాసికొనితేమ భళీ!

భళీ! యని కాశీముక్తై చెదర నెశితలంపునే అట్టివారికి రాజానుగ్రహా మొక్కటున్నఁజాలు ప్రసిద్ధమైపోయినను వారికక్కఱలేదు. ఇట్టిమహా పురుషుఁ లభించినప్పుడు పాలకులకింకేమి లోపము. కావున నేవాలకులీ కాశీప్రతిపతులనే గల్పతరువులట్లు భావించుచున్నారు.

(తెఱలో) కచా! ఇటురమ్ము.

కచు — దేవయానీ! గురువుగారు నన్ను బిల్చుచున్నారు. వెడలి వచ్చి మరల చెప్పెదను.

దేవ — మహాభాగా! ఇఁక వినవలసిన యగత్యములేదు.

తే. గీ. ఇంతవఱకును దీనిపైఁ ◆ భ్రాంతిచేత
నిట్టిచెడుగులు గలవటం ◆ చెఱుఁగనైతి
తెలిపితివి నేఁడు దయతోడ ◆ తేటగాను
గాన మద్యంబునకు నమః ◆ స్కారమిదిగో.

[చేతిలోని భృంగారమును పారవైచి] ఓపురుషోత్తమా? ఇఁకమీఁద నీసురాపాన మొనరించినచో గురుపాదంబులుఁ దప్పినట్లు-పంచ మహాపాతకంబులొనర్చినట్లు-నేనీదురభ్యాసమును బూర్ణముగా మాని కొనుటయే గాక నాచెలులకుఁగూడ బ్రబోధంబుజేసి సాధ్యమైనంత వఱకు వారిచేఁగూడ మాన్పించుటకు బ్రయత్నించెదనని నీపాదము లంటి శపథమొనర్చుచున్నదానను.

కచు — గురుపుత్రీ! సంతోషము. భగవంతుఁడు నిన్ననుగ్రహించుఁగాక. నీయుద్యమమునకు బరమేశ్వరుఁడుగూడ తోడ్పడుఁగాక. [అని నిష్క్రమించును.]

దేవ — [వెనుదిరిఁగి] చెలులారా! ప్రొద్దుపోయినది. మనము గూడ పోవుదమా?

ముకుం — కచుఁడు వెడలిపోవుటచేత నిప్పటికైనను ప్రొద్దుపోయినదని తెలిసికొంటివి, నయమే.

దేవ — వెఱ్ఱివాఁడా! చెప్పుచున్నవాఁడు కచుఁడుగదా యని నేను మాటలతటస్థింపలేను. ధర్మములుపదేశించుచుండెనుగదా యని వినుచుంటిని. ధర్మములెవఁడుపదేశించినను గణియో గాక పాత్రాపాత్రౌచిత్యమాలో

చింపక వినవలసినదే. అట్లువినకుండుటధర్మము.

ముకుం — అట్లనా? కేవలధర్మమూర్తివి. [దేవయాని తన చెలులతో నిష్క్రమించును.]

ముకుం — శర్మిష్ఠా! దేవయాని నడవడిక యిప్పుడర్థమైనదా?

శర్మి — స్పష్టముగా!

ముకుం — ఇది శుక్రుఁడెఱుఁగునా? ఎఱుఁగఁడా?

శర్మి — నాకుమాత్రమెట్లు దెలియును?

ముకుం — నేనీవిషయము గురువునకెఱింగింపనా?

శర్మి — మనము చెప్పినలాభములేదు. అతఁడు తనకూతురిష్టప్రకారము చేయునేమో; ఇంకొకవిధముగా శత్రునాశన మొనరించుకొనుటమంచిది

ముకుం — ఏమిచేయుదము?

శర్మి — ఏదియోయొక కుతంత్రమును బన్ని రాజునకు కచునిపై గోపమువచ్చునట్లుఁ జేసితిమేని కార్యసాఫల్యమగును.

ముకుం — అగు నగును. నీయూహ బాగుగానున్నది. ఏమి పన్నుదము.

శర్మి — ఆలోచించుదమురా! పోదము.

నిష్క్రమింతురు.

తృతీయరంగము.



తురీయరంగము.



— * వృషపర్వుని కొలువుకూటము. * —

[వృషపర్వుఁడు, మహాబలుఁడు, ముకుందుఁడు, శర్మిష్ఠయు నుచితాసనములపైఁ గూర్చుండియుందురు.]

వృష — [శిరఃకంపనమాచరించుచు] అమ్మా! శర్మిష్ఠా! వ్యవహారమింతవఱకు ముదిరినదా? ఇట్టివారి మదంబడంచుటెంతలోనిది? సరే కానిమ్ము, తదనంతరయుదంతంబేమి?

శర్మి—నాన్నగారూ! వారివారి యుదంతంబంతయు జక్కగా మీయారయుచునేయుంటిరి. ఎంతకును బృగూడ కుటిలవర్తనుడయ్యెనను టకెట్టి సందియము నక్కరలేదు. అట్లు లేగా దేనికిరో? కుమారుని జేరదీసియాదరించుట కేమియగత్యము? విద్య చెప్పుట కేమి కారణము? పోనీయా విమయాంబులట్లుంచుఁడు. తనకుమార్తె దేవయానిగదా? కచుఁడన్యపురుషుఁడుగదా? అట్టి కచునితోఁ దనకుమార్తె "గుసగుస"లాడుచుండఁ జూచియుఁ జూడకుండునట్లు గురుండూరకొనుట కేమి కారణమో యూహింపుఁడు. ఆచార్యునియైదు ప్రాణంబులును, దేవయాని మోహంబునుఁ గూడ కచునిపైనున్నయవి. దేవతలయందభిమానమే లేకయున్నచో నీయకార్యకార్యాచరణకాకుఁ క్రిందెట్లు సమ్మతించును?

ముకుం—సమయమునచ్చినప్పుడు యదార్థమెఱిఁగింతునూరకొనినచో రాజద్రోహమగునను భయంబు పెంపున నీమ కిప్పుడిది గూడ చెప్పుచున్నాను. గురువు కపటియనుటకు తమూతర్రియును సందేహము లేదు. కావున నేనింక మీపారశాలకు రాననియు, మీవిద్యనాకక్కఱ లేదనియు వ్రాసిపంపివైచినాను. రాజద్రోహము నగ్గువారిదగ్గఱ విద్యనేర్చుకొంటె రాజద్రోహమే పట్టుబడుతుంది. విధవకుదండము పెట్టినప్పుడెట్లు దీవించునో యోజింగుమా?

వృష—ఏమేమీ! కాన్యుఁడుగూడ తనకుమారితో నేకీభవించెనుగా? ఎంతద్రోహమెంతద్రోహము. [మంత్రితో] మంత్రీ! మహాబలా! వింటివా? ఆచార్యుని దుష్కృత్యము? [కోపముతో]

మ॥ గురుఁడంతర్గతదుర్గోప్యఁ జేయుటను సం ♦ కోచింపకుండంగదు
ష్కరచిత్తుండయి దేవతాధములతో ♦ సఖ్యంబు గావింపఁగాఁ
గరముత్సాహము బూనెగావలయు నిం ♦ కనేమిసన్నాహ దు
ర్భరమౌ బాధల నెన్నిగల్గునొ? వచియిం ♦ పన్ శక్యమే పెగ్గిడా!

మహా—దేవా! ఈజనము లోకరీతిన్ముట్టకుఁ దోసడనములా? ఆవగింజంతవకాశము దొరకినచోఁ గాలుక్రిందఁ గోఁతులు దీయుట కుపక్రమింతురు. కుమారునినైన నమ్ముటకు వీలు లేదు.

నృప—[శుక్రునుద్దేశించి క్రోధముతో] ఓమందుఁడా! శుక్రుఁడా!! తిన్న యింటివాసములు లెక్కింపననుకట్టితివా? కృతఘ్నుఁడా! పాలుఁదాగి తల్లి రొమ్ముఁ గ్రుద్దఁదలఁచితివా? ఏలరా నీకీ మాత్సర్యము? నీవింత యవివేకివై పోతివేమి? ఒక్క మృతసంజీవనీ మంత్రము నీచెంతనుండుటంబట్టి నిన్నుఁబూజింపవలసివచ్చుచున్నదిగాని లేకున్నచో నీవొనరించుచున్న రాజద్రోహమునకు—

తే. గీ. తుండె తుండెము లట్లుగాఁ ద్రుంచివైచి
గ్రద్దలకు వైచియుండినఁ గలదె భవము
యేరిసొమ్మును దినుచు నీ వేమి జేయ
దలఁచి యున్నావొ? లవమైన దలఁచినావె?

మహా—దేవా! ఇట్లొనరించుటకేమి కారణమని యడిగినచో నాతఁడేమి సమాధానంబిచ్చునో వినుట సమంజసమని దలంచెదను

మం. శుం—మన శాస్త్రిగారి-అడుగుటరోఁ తడవుగా-అసలు సంగతంతయు చెప్పినా? అడిగిన దానికేదో చెప్పి తప్పుకొంటాడు దేశద్రోహులు కంచరపిల్లులు. వారికి సదుపు బెదురు నుండదు. తాకాధ్యాయాలు కావాలి. తరువాత దేవతలతో సంబంధము వదలాలి. అప్పుడు తాఁడు చెప్పినట్లు లొంగాలి. అంతవఱకు వాఁడు లొంగుతాఁడా? శుక్రుఁడంటే సామాన్యుఁడు కాడు.

మహా—అగునగును. నిష్కారణమాతఁడు శపియించినను శపియింపఁగలఁడు.

నృప—అందులకయే నేనును భయపడుచుంటిని. లేకున్నచో నొక్కనిమిష మాత్రంబున—

ఉ. కన్నులనూడఁదీసి కడ గండ్లకు లోనగునట్లుఁ జేసి చే
తెన్నుల కాఁకఁబెట్టి పలు తిప్పలకు న్నలయొగ్గఁ జేసి వాఁ
డెన్ని విధంబు లేడ్చినను బించుకయుం జెవియొగ్గఁబోక నా
చెన్నఁటి పాపచింతనము జేయుచు చచ్చుట కండ్లఁజూడనే.

శర్మ—జంకా! ఆగ్రహము సర్వనాశన మొనరించును. ఆగ్రహమును విడి కార్యక్రమమునకుఁ గడఁగుడు. కార్యాచరణసమయం

కావఁ గాలవారణమొనర్చినచో మృతసంజీవనీమంత్రమీ దేవతల పాలగుటయు, దానితో రాక్షసుల మనలను దాపురించుటయు తథ్యము. కావున కర్తవ్యాంశంబునకై గడంగుడు.

వృష—[క్రోధముతో] ఆఁ. ఆఁ! నాకంఠములో ప్రాణము లుండఁగా మృతసంజీవనీమంత్రమితరులపాలగుటయే. (శిరఃకంపన మాచరించుచు) కానిమ్ము మచ్చటయున జూతము. ముందాలోచన చేయుటకైనను మంచిదిగదా? మహాబలా! ఇందు నీయభిప్రాయమేమి?

మహా—తగినట్లు మృదువాక్యములచే బోధించినచో గురుండీయుద్యమంబునుండి మరలునని తోచుచున్నాఁడను. పిమ్మట మీచిత్తము.

వృష—[సందియముతో] గురుఁడు మనప్రార్థనమునకుఁ జెవియొగ్గునా?

ముకుం—ఒగ్గడు. ఒగ్గడు. మీదుమిక్కిలి మనమాతని రహస్యమును గ్రహించితిమని తెలిసిన యాగ్రహముదెచ్చుకొని మనకపకారము చేయునేమో యించుకాలోచించుకొనుఁడు. [అపవారించి శర్మిష్ఠతో] శర్మిష్ఠా! అక్కడకు వీరువెడలకుండ జేయుము. వీరు వెళ్లారంటే మనకొంప మునుగుతుంది. ఆపైని నీయిష్టము.

వృష—అగునగును. ఇదియు నాలోచింపవలసినదే.

శర్మి—దేవలతో స్నేహమున్నటికిని మనగురువునకు సరిపడదుగాని నాకొకయూహజనించుచున్నది అట్లుజేసిన బాగుండునేమో?

వృష—అదేదియో వినిపింపుము.

శర్మి—సావధానచిత్తులరై వినుండు. మనకావ్యుండు సాధారణముగా నామంత్రమితరులకొసంగడుగాని కచుండల్లుఁడైనచో వానిపైఁగల యభిమానంబు పెంపున నవ్విద్యనుపదేశించిన నుపదేశింపవచ్చును. కావున మనమీలోపున నేఁగచుని ప్రాణవాయువుల మనమపహరించితిమేని దేవతల యాశాలతతోఁబాటు శుక్రుని యుద్యమముఁగూడ మూకటివ్రేళ్లతో గూలిపోవును. ఏమందురు?

ముకుం—ఇంతకంటె మంచిమార్గమీలోకములో లేదు.

వృష — అమ్మా! భాగు. భాగు. చక్కనియాలోచనము జెప్పితివి. మహాబలా! దీనికేమందువు?

మహా — నిరపాయంబైన యుపాయంబగుటచే నదిచాలమంచి యాలోచన.

వృష — అట్లయిన నోసుమతుండా! నీవు నలుపురు హంతకులతో గలసి యరణ్యంబున కేగి యాకచుండగుదెంచిన వెన్క సమయంబు గనిపెట్టి.—

తే. గీ. మీరలందఱు నేకమై • మీఁదికుఱికి
బలిమిమై కీలు కీలును • బట్టివిఱచి
చిత్రవధఁ జేసి కసిదీఱఁ • జటికలోన
మాఱుమాటాడకుండంగ • మరలిరండు.

వానికి సహాయులై యెవ్వరడ్డువచ్చినను ఖడ్గమునకు బలియిండు. ఇదిగో! హంతకులకీయానవాలొసంగి నాయాజ్ఞగాఁ జెల్పి వారిని దోడ్కొనిపొమ్ము.

సుమం — (కైకొని) చిత్తము. [అని నిష్క్రమించును]

వృష — మంత్రీ! మనముగూడ వెడలుదము రమ్ము. అమ్మా! నీవంతఃపురమునకుఁ బొమ్ము. [వృషపర్వుఁడును, మంత్రియు నిష్క్రమింతురు]

శర్మి — దేవయానియుబలాట మింకొక్కదినములో జల్లాఱిపోవును. అప్పుడా నిర్భాగ్యురాలేమిచేయును? చేయుటకేమున్నది? చేతులు నలుపుకొనుచు — విధినిదూఱుచు — తననిర్భాగ్యత్వమున కేడ్చును. ఇప్పుడు దేవయాని నాయెడలఁ జూపిన యనాదరణభావమప్పుడామెయెడ జూపింపకపోవుదునా? [సంతోషముతో నిష్క్రమించును]

ద్వితీయాంకము.



ముకుం — నీకు మరణకాలము సన్నిహితమైనదని తెల్పుటకు.

కచ — [నిందాగర్భముగా] నీకెట్లు తెలిసినది.

ముకుం — నన్నుఁ జూచిన నీకు నవ్వువచ్చుచున్నదా? నవ్వే నవ్వుము. [రహస్యముగా దాచిన కత్తిఁదీసి చూపుచు] ఈ కత్తి — ఇది గోయికత్తి — తెలిసినదా.

కచ — ఛీ! ఛీ! నీతో నాకీ యప్రస్తుతప్రశంస యేల?

[అని నడచుచుండఁగా ముకుందుఁడడ్డునిలుచును]

కచ — ముకుందా! దారిఁదొలఁగుము.

ముకుం — ఈదారి నీకొసంగనుగాని — నీవింతగాఁ బ్రార్థించుచుంటివిగాన — యమాలయమునకు దారిఁజూపించెదను. [అని కచుని ద్రోయును]

కచ — [ఆపుకొని] ముకుందా! వృథాకలహమును బెంచి చెడిపోకుము.

ముకుం — నీవా? నేనా! కలహమును బెంచుచుంట? [మరల గెంటును]

కచ — మాటలతో తొలఁగవా? [ముకుందుని గెంటును. క్రిందఁబడి కెవ్వునఁ గేకఁబెట్టును.]

[వెంటనే ఘాతకు లరుదెంచి బలవంతముగాఁ గచునిఁ బడవైచి
నఱికివైతురు. ఆసందడికి నుపాధ్యాయు లిరువురున్ను
అరుదెంచి చూచి పాఱిపోవుదురు.
ముకుందుఁడు లేచును.]

తెరవ్రాలును.

ప్రథమరంగము.

---

## ద్వితీయరంగము.

—◆ స్థలము:—శుక్రాశ్రమము ◆—

[ద్వారముచెంత దేవయాని నిలువంబడి యుండఁగా తెఱలేచును]

దేవ—[ఇటునటుఁజూచి నిర్వేదముతో]

ఉ॥ కోరినకోర్కె యెట్టులొనఁ ◆ గూడు ఘటించెద నెన్నిరీతులో
యారయుచుంటిఁ గాని యొకఁ ◆ డైనను మార్గము గానరాద దే
ఠీరుచనైన యాకచుని ◆ దివ్యపదంబులఁ గొల్చు భాగ్యమా
కారణకారణుండయినఁ ◆ గల్పనఁ జేసెనొకో చేయకుండెనో?

[ఒక్కనిమేషమట్లనే నిర్ఘాంతపడిచూచి] నాయదృష్ట మెట్లున్నదియో యెవ్వరెఱుంగుదురు? ఓపరమేశ్వరా! నాయాశాలతనేమి చేయఁదలఁచితివి? మద్భాగ్యమెట్లున్నయది? [నిమీలితనేత్రయై] దీనబంధూ! కరుణాసాగరా!! భక్తవత్సలా!!! నీ నియామకమెట్లున్నదియో యెఱుఁగుట కవకాశము లేకుండెను. ఆబృహస్పతికుమారుని మనోవృత్తి యెట్టిదియో యెఱుంగుటకైన నవకాశంబు గలుఁగకుండెను. తొందరపడిన ముందుకార్యంబునను భంగంబు వాటిల్లునను సంధర్యంబు పెంపున నేటికిని మదభీష్టం బెఱిఁగింపఁ జాలకుండానను. ఆర్తావనదీక్షాపరతంత్రా! నాయభిమతమీడేర్చుట నీచేతిలో నున్నయదిగాని—అబలను—కార్యాలోచనమంతగాలేని యాఁడుదానను—నిస్సహాయురాలను—నాచేతిలో లేదు. నన్నురక్షించుభారమంతయు నీదియే. తండ్రీ! అనుగ్రహింపుమనుగ్రహింపుము. [ఇటునటుఁజూచి] ఏమిచెప్పుదును? సమిత్కుశాదులకై సహాధ్యాయులతో నరణ్యంబున కరిగిన కచుండు సాయంసంధ్యాసమయము గావచ్చినను గ్రమ్మఱిరాకయున్నవాఁడు. [కచునినుద్దేశించి] ఓవాచస్పతిపుత్రా! నీప్రేమాకాంక్షిణిని—నీ మనోహరసుందరవదనారవింద సందర్శనోత్సాహిణిని—నన్ను దైవముగా భజియింపఁదలంపూనిన సుస్థిరచిత్తంబుగలదానిని—ఇట్లు బరితపింపఁజేయుట న్యాయమా? నీకేలనాపయి దయరాదు? నాహృదయస్థితాభిప్రాయ—మభినయపూర్వకముగా సాకునేన బయల్పఱచిన

నీ కేల నీవంశయము? మదభీష్టంబెఱింగిచినయంతనే మజ్జనకుం డనుమ
తించునను నాశయాకు నాకున్నది. కాని నీయభీష్టమెట్లుండిన నాజనకు
నికి నేనేమని తెల్పఁగలను. [సంశయముతోఁ జూచుచుండును.]
[వివర్ణవదనములతో నీలుఁడును, గరాళుఁడును బ్రవేశించుచున్నారు]

నీలు—నీవు చెప్పుము.

కరా—నీవే చెప్పుము

దేవ—[చూచి] ఓయీ! మీరిరువురేదనుదెంచితిరేమి? మీ
నపాధ్యాయుండును, బృహస్పతికుమారుండును నగు కచుం డెచ్చట?

నీలు—చెప్పుమురా? ఊరకొనిన తరువాత మేమి లాభము?

కరా—నావలనఁగాదు. నీవే చెప్పుము.

దేవ—ఓహో! మీరుపలుకరేమి కారణము? కచుఁడు క్షేమ
ముగానుండెనా?

నీలు—లేదు. అబ్బ! చెప్పరా?

దేవ—సోదరులారా! మీరేల యాలస్యంబొనరించుచుంటిరి? మీకొక్క నమస్కారము. జరిగిన వృత్తాంతమేదియో, కచుఁడెట నుండెనో దెల్పి నాయులముట బాపుడు.

నీలు—[తలవ్రాల్చుకొని] అమ్మా! మేమదృష్టహీనులము.

దేవ—గద్గదస్వరముతో] కా-ర-ణ-మే-మి-?—

కరా—ముకుందుఁడింతవాఁడగునని యెన్నఁడనుకొనలేదు.

దేవ—నాయనలారా! మీపలుకులు నాకర్థమగుటలేదు. తేటతెల్లముగ దెల్పి నన్ననుగ్రహింపుఁడు? ముకుందుఁడేమి చేసెను?

నీలు—అమ్మా! ముకుందునకు మన కచునిపైఁ గ్రోధమెందు
లకుఁ గల్గెను?

దేవ—నాయనా! ముకుందుఁడు కేవలము మూర్ఖుఁడు, మూర్ఖు
లకు యుక్తాయుక్తజ్ఞానముండదు. వారికోపమునకు మితిలేదు, దయ
యును నుండదు. వానిక్రోధమెట్లు పరిణమించినది?

కరా—వాఁడేరికో నలుగురుదుష్టులను వెంటఁబెట్టుకొని మా
కంటఁబడకుండగా నరణ్యంబులోఁ బ్రవేశించి యొకచో డాఁగియుండెఁగాన

గాయను మాకా యదంతంబేమియు దెలియదు. సమిత్కుశలకై చక్కనివృక్షంబొక్కటి చూచుకొని మేమిసుపురమా వృక్షరాజము నధిరోహించితిమి. కచుఁడువారిక్రింద నేయుండెను. మేము వృక్షాగ్రములవఱకుఁ బోవునప్పటికి హృదయవిదారుణ బగు నొక యార్తారవము వినఁబడినది

దేవ—[వడంకుచు] ఆ-యా-ర్తా-ర-వ-మా-తనిదికాదు-గదా?

నీలు—ఎవ్వరిదో మేమెట్లు చెప్పఁగలము ? మేమయ్యెడనుండి గో దిగువకుఁజూచునంత మకుందుఁడు క్రిందఁబడియుండెను. మన కచుఁడానమయంబున నాతని వక్షంబుపైఁగూర్చుండి యాతనిఖడ్గమూడఁబెఱికి కొనుచుండఁగా దాఁగియుండిన మకుందునియనుచరులు హఠంబుగాఁ గచునిపైఁబడి నిమిషములోవేళ్ళు చుగ-ధా-వ-శే-షు....

దేవ—హా! దైవమా! నీనియామకమిట్లున్నదా? [అని మూర్ఛిల్లును.]

నీలు—[భయముతో నిటునటుదిరిగి] కరాళా! నీవతిత్వరితంబుగ వెడలి గురువుగారిని దోడ్కొనిరమ్ము

కరా—[నిష్క్రమించును.]

దేవ—[మూర్ఛఁదేలి తనలో విచారముతో] ఓ దేవగురుపుత్రా! నీప్రాణవాయువులీ నరహంతకుల పాలొనరించి స్థూలదేహము న్విడచి—సూక్ష్మదేహముతో నీస్వస్థానముఁ జేరితివా? నీపైననే పంచప్రాణములు నిల్పికొనిన నన్నోగతిపాలొనరించితివా? నీజనకునిదరిలేని దుఃఖాంభోనిధిలో ముంచివైచి—వృద్ధునకుగతి లేకుండఁజేసివైచి—అనిమిషులయాశాలతను నీకొనగోటిచేఁ ద్రుంచివైచి—నీగురుపత్నినపఖ్యాతిపాలొనరించివైచి—నీవరుగుటభావ్యమా? ముని:—[అచటనున్న నీలంగాంచి తనలో] అక్కటకటా! బిగ్గఱగానేడ్చుటకైనను వలనుగాకుండవచ్చెనే? నాయాశలెంతలో నంతరించిపోయినవి. అయ్యో! దైవమా!

తే. గీ. ప్రాణములకన్న మిన్నగా ♦ భావమందఁ
దలఁచి యెవ్వనినేఁ గొల్చు ♦ లలితమూర్తి
వీడె దనజీవముల పని ♦ వినియుఁగూడ
వ్రయ్యలవకుండె హృదయంబు ♦ వజ్రమేమొ?

[స్వగతమభినయించి] ఏమిది? నేనింత మందబుద్ధినై పోతినేమి? జీవములఁ దొఱంగిన నెట్టివారినైన—నెట్టిస్థితియందైన—సజీవునిగాఁ జేయఁగల మృతసంజీవనీమహామంత్రరాజమే నాజనకునియధీనమునందుండ నేనిట్లు చింతించుట వెఱ్ఱితనము గాదే? కావున నేవేవేఁగఁజని మజ్జనకుఁ బ్రార్థించి యాకచుని—మన్మనోహరుని—సజీవునిగా నొనరించుకొందునుగాక [లేచి రెండడుగులువైచి సందియముతో మరల చతికిలబడి] అట్లయిన నామనోరహస్యము బయల్పడునేమో? [ఇంచుకాగి] అట్లు బయటఁబడకుండఁ బ్రార్థించు మార్గమేమియు లేదా? [ఆలోచించి] ఆఁ చక్కనిమార్గమున్నది. అట్లొనరించినచో నామనోగతరహస్యము బయల్పడకుండుటయేగాక—మన్మనోరథంబుగూడ నీడేరును. పిమ్మట వృషపర్వునకీ దారుణాంశం బెఱింగించి యీముకుందుని పొగరడంపవలయును

[అప్పుడు శుక్రుండు కరాళునితోఁ బ్రవేశించుచున్నాఁడు]

శుక్రు—[తనలో] ముకుందుఁడింత ధైర్యమువహించి నాయధీనమందున్న కచుని మర్దించుట కేమికారణము? [దివ్యదృష్టినిడిలకించి క్రోధముతో] ఓరీ! ముకుందా!

చ. "గురుఁడిటు దేవతాధముని ♦ గొంకకఁ దాఁదరిఁ జేర్చి మంత్రమున్
గఱపఁగనున్నవాఁడు కడు ♦ గారవమొప్ప" నటంచు గొండెముల్
వరగునఁ జెప్పి రాజును వ ♦ శంబుగఁ జేసుక నిట్టికార్యముల్
స్థిరమతిఁ జేయఁ బోయితివె? ♦ చెన్నటి! తుచ్ఛుఁడ! మందబుద్ధివై.

[పైకిదృష్టినిగిడ్చిచూచి తలబంకించుచు] శిష్యుఁగూడ నీపాపకార్యంబునఁ బాలుగొనెనదా? కానిమ్ము. మిడిగర్వమడంచితీరెదను. [క్రోధముతో] ఓవృషపర్వా! నీవింతయవివేకివై పోతివేమి?

తే॥ గీ॥ నీదు దరిఁజేరి కొండెముల్ ♦ నమ్మిబలుక
విసుటయేగాని సత్యంబు ♦ గనఁగలేవె
చెప్పువారి వివేకంబు ♦ చెల్లిపోవ
నోర్మి వినువారికైనను ♦ నుండవలదె?

కానిమ్ము. నీవిపుడు మెచ్చుకూడ నింకముందు దగినంత మెలుకువఁగలిగి యుండుము. [అని శిష్యునితో] శిష్యా! మా దేవయాని యెచ్చటి?

నీలు—ఆచార్యోత్తమా! ఇదిగో మాసోదరియిట గూర్చుండి యున్నది.

దేవ—తండ్రినిఁజూచి గుభాలున లేచి [సమీపమునకరిగి] జనకా! జనకా!!

సీ॥ తమ శిష్యకోటిలో ♦ విమలుఁడెవఁడనఁ "వీ
డని" చూపుటకుఁ బాత్రుఁ ♦ డైనవాఁడు
గురుభక్తియుతుఁడైన ♦ పురుషుఁడెవఁడన్న "వీ
డను" వాక్యమున కర్హుఁ ♦ డైనవాఁడు
చిత్తవిభ్రాంతిని ♦ చెందఁడెవఁడన్న "వీ
డను" నాలుకకుఁదోడ ♦ వైనవాఁడు
నిత్యసత్యవ్రత ♦ నియుతుఁడెవఁడన "వీ
డని" చెప్పుటకు సరి ♦ యైనవాఁడు
అంగిరసు ముద్దుమనుమఁడై ♦ యలరువాఁడు
అలరువిల్తుని సోయగం ♦ బమరువాఁడు
సరస సద్గుణ ఖని యనఁ ♦ జాలువాఁడు
మహిత విజ్ఞాని కచుఁడింక ♦ మనకు లేడు॥

తండ్రి!

సీ॥ చలిచీమనేనియు ♦ నలఁగఁద్రొక్కనివాని
శరణన్న శత్రులన్ ♦ సాకువాని
పరుల యాపదఁగాంచి ♦ పరితపించెడువాని
చేతనౌ నుపకృతి ♦ సేయువాని
తన బలమెంతైన ♦ నణఁచుకొనెడు

పరబలంబునఁ గీర్తి • బఱచువాని
నిత్యసత్యవ్రత • నియతాత్ముఁడగువాని
క్రోధమింతయు లేని • గొప్పవాని
చిన్నపెద్దల సమబుద్ధి • నెన్నువాని
నేరి మర్యాదవారల • కిడెడువాని
గురునిసద్వంశంబునునిల్పు గుణ, ఖని, నయొ
యీముకుందుఁడు వధియించె • నంట వింటె?

జనకా! సద్గుణఖనియగు మనకచుఁడు క్రూరాత్ముఁడగు ముకుందుని కేమి యపకృతి సల్పియుండును?

ఋషి—అమ్మా! నీవింకనుఁ గండ్లుదెఱువని పసిపాపవు. ఆకతంబున లోకజ్ఞానమంతేగాఁ గడియించినదానవుగావు. కావున నిట్టులంటివి. దుర్మార్గులకుఁ గ్రౌర్యమే—అనఁగా—వారి వారిస్వభావమే కారణముగాని మరియొండేమిగలదు? పలసినన్ని మృగంబులఁబట్టి వధియించి కడుపుచిచ్చుఁ జల్లార్చుకొనిన పిమ్మటగూడ పెద్దపులికనఁబడినమృగంబులనెల్ల వధించుటకేమందువు? మృగరాజట్లొనరింపకుండుటకేమికారణమందువు? ఇట్టిప్రశ్నంబుల కన్నింటికిని "స్వభావము" అనుటకంటె వేరేమియు సమాధానము లేదు

దేవ—జనకా! కచుఁడు మీచెంత విద్యార్థిగాఁ బ్రవేశించిననాఁడు తమరు నాకొకహితోపదేశ మొనరించితిరి. జ్ఞప్తియందుండవచ్చును. మీరెట్లనుమానించితిరో దుదకట్లేయైనది. ఇప్పుడు మీరుపేక్షించుటవలన మీకుఁగలుగు నపఖ్యాతి వర్ణనాతీతమై యాచంద్రతారార్కమై చతుర్దశ భువనంబులయందును నిల్చిపోవును. మీరనినయట్లు నిందభరించుటకష్టము. ప్రాణములకై సందేహించి యశోల నార్జింపవలయుఁగాని యూరకుండరాదు అట్లూరకొనుట ప్రాజ్ఞుల లక్షణముగాదు. జనకా! మీకెంతదూరము జెప్పవలసినదానను గాను. సర్వమును మీరెఱుంగుదురు. ఈయపఖ్యాతినిఁ బోఁగొట్టుకొంట మీచేతిలోనిపని. మృతసంజీవనీమంత్రపఠన మహాత్మ్యమువలనఁ గచు నిబ్రదికించి మీయపఖ్యాతిఁ బోఁగొట్టుకొని మీధర్మమును మీరు

గాఁ బాడుకొనఁడని వేఁడుచున్న దానను మీరనుగ్రహించితిరేని కచుఁ డునజ్జీవుఁడగు. బృహస్పతిపుత్రుఁ డింతుఁడగు. శుక్రుఁ డపఖ్యాతిపాలుగాకుండనుండును. సకలశ్రోయోదాయకంబగు తండ్రి! ననుగ్రహింపకతప్ప దనుగ్రహింపుము.

శుక్రు—అమ్మా! నేనుమాత్రము నిందభరియించుట కనుమతింతునను కొంటివా? [శిష్యునితో] శిష్యా! కమండలోదకమిటు తెమ్ము.

నీలు—చిత్తము. అని నిష్క్రమించి కమండలముఁ దెచ్చి యొసఁగును.

శుక్రు [కమండలములోనిజలము దీసికొని మంత్రముల బఠించి విడుచుచున్నాడు.]

[అప్పుడు శర్మిష్ఠ బ్రవేశించుచున్నది]

శర్మి—[తనలో] ఇప్పుడు దేవయాని వదన మెట్లుండునో జూడ వలయునని కుతూహలముతో నేనిచ్చోట కరుదెంచితిని. [దేవయాని నుద్దేశించి] నన్ను మించినకోరిక నీవు గోరుటచేత నిష్కారణమాకచునికిట్టి యకాలమరణము దటస్థించినది. ఇది తాదృశముగాఁ గైకొని యెన్నఁడిట్టి యుడికూనలకుఁ బోకుము. మహారాజకుమార్తెనగు నాకులేని భాగ్యము బ్రాహ్మణపుత్రికవగు నీకుఁగలుఁగుననుకొంటివా? ఒకానొకవేళ నట్టిభాగ్యము విధాతనీకొసఁగ లిఖించినను విధాతయాన మదంపఁగల నాజనకునిచే నీకొసఁగనున్నవారిని నీవలపుకాని రక్తముచే దుడిపింపకమానకుందునా? జాగ్రత్త.

శుక్రు—[అపవారించి] అమ్మా! శర్మిష్ఠతో నెన్నఁడును మనసిచ్చి మాటాడకుము. కారణము మాత్రమిప్పుడు నన్నడుగకుము.

దేవ—చిత్తము.

శర్మి—[దేవయానిఁగాంచి తనలో] దేవయాని విచారించుచున్నట్లునఁగానరాదేమికారణము? [ఆలోచించి] కచుఁడీమెవలపుకాఁడుకాఁడా? అట్లైనఁగచుఁడు నిష్కారణముగా వధింపబడెను

న్నమాటయే. [ఇంచుకాఁగి] లేదు. లేదు. కచుని నీవు మనసార ప్రేమించినమాటవాస్తవము. ఇదేమియు సందియములేదు. అట్లయిన కచునకొఱకు విచారింపదేమి?

[అప్పుడు కచుఁడు ప్రవేశించును]

కచు—[నడచుచు శర్మిష్ఠనుజూచి] శర్మిష్ఠా! క్షేమమా.

శర్మి—[అదలిపోయి వెనుకకుఁదగ్గి వెఱ్ఱిచూపుజూచును.]

కచు—[వడివడిశుక్రునిచెంతకరిగి మోకరించి] మహానుభావా! ఘోరకాంతారమధ్యంబున నిష్కారణముగా, బలవంతముగా రాక్షసులచే బ్రాణంబులుఁగోల్పోయి మరల తమమృతసంజీవనీమహిమచే బునర్జీవుఁడై జనుదెంచిన కచుఁడభివందనము జేయుచున్నాఁడు. గైకొనుఁడు. గురువర్యా! మీఋణము వేయిజన్మములకైన నుదీర్చికొనఁగలనా? కొండంతదేవునిఁబూజించుటకు కొండంతపత్రియుఁదెచ్చుటసంభవము చంద్రునకొక నూలుపోగుచందంబున నాయీకృతానేక నమస్కారంబులఁ గైకొనినన్ననుగ్రహింపుఁడు,

శుక్రు—[సాదరప్రేమతో లేవనెత్తికూర్చుండఁబెట్టి] దీర్ఘాయుష్మాన్భవ. కుమారా! నీవునన్నింతుఁబొగడవలసిన పనిలేదు. నావిధ్యుక్తధర్మమునే నాచరించితిని నీకిట్టియిడుములలవడుననియు, నట్టిసమయంబున నిన్నుగాపాడుట నాకువిధియనియు నేనుతొలుదొల్తనే యనుకొంటిని. నాయనుమానమున కనుగుణ్యముగానైనది, కానిమ్ము ఇఁకభయములేదు.

దేవ—దేవగురుకుమారా! నీదేహస్థితియిప్పుడు బాగుగానున్నదిగదా? మజ్జనకుండా ముకుందుని పొగరణంచును విచారింపకుము. అగునుగాని ముకుందునకు నీపైఁగ్రోధమెందులకు దయించినదందువు?

శుక్రు—అమ్మా! ఇదియానవాయము. ఈతఁడలసియున్నవాఁడు ప్రప్రథమమువనీని యాయాసమూదొలఁగునటులొనరించి యాహారాదులొసంగి యాపిమ్మటకారణమడుగుట సమంజసము. కావునమనము లోనికింబోవుదము రమ్ము.

దేవ—చిత్తము [నిష్క్రమింతురు.]

శర్మి—[ఒక్క పెద్దనిట్టూర్పువిడచి] ఎంతపనిజరిగినది. చచ్చిన వానిని మృతసంజీవనీమంత్రమాహాత్మ్యముచేమరల బ్రతికించినాడా? భార్గవునిమంత్రమాహాత్మ్యమును మరచి యీకార్యము జయప్రదముగా ముగియుననుకొంటిమి. కచుఁడు జీవించియున్నంతవఱకును నామనమునకూరటజనింపదు. కానిమ్ము. ఇప్పుడుమించినదేమి? ఈ మారుజీవించినను మరల గృహంబునకు రాజాలని విధంబాలోచించి కచునిఘట్టిబెట్టింపవలయును ఈవిషయమై మజ్జనకునితో నాలోచించెదగాక. [నిష్క్రమించుచున్నది.]

ద్వితీయరంగము.



## తృతీయరంగము

—* స్థలము:—శుక్రాశ్రమమునకు ముందరిభాగము *—

[వృషపర్వుఁడును, మహాబలుఁడును బ్రవేశించుచున్నారు.]

వృష—మంత్రీ! మహాబలా!!

మ॥ మనపైద్వేషము, దేవతాళిపయిన ♦ న్మన్నించు నత్యేమియుక్తా
మన, శుక్రుండెటు చూడఁగాఁగడఁగెనో ♦ మంత్రీ! విచారింపుమా
యనఘుండీక్రియ దేవయాని కొఱక ♦ న్యాయంబు లెన్నన్నియో
నొనరింపంగను నిశ్చితాత్ముఁడయిదా ♦ నున్నాడు నాపల్లనే.

నాయొక్కనితోఁ బోయా? గురుని యీయవివేకంబువలన మనయాలంక కంటకముఁజేటువాటిల్లుననుట నిశ్చయము. దేవతలనిందుఁబ్రవేశింప నిచ్చితిమేని బ్రహ్మచరుఁడు డొంకవోలె నెల్లెడలనలముకొని మనల బ్రతుకనిత్తురా? ఇంతకంటె దారుణమింకేమైనఁగలదా?

తే॥ గీ॥ దనుజకోటిని తనముద్దు ♦ తనయ లటుల
జూచుకొనుచుండ వలసిన ♦ శుక్రుఁడిట్లు
కడకు దౌర్మార్గ్యములఁజేయఁ ♦ గడఁగినప్పు
డెంచి గురుఁడంచు నతని మ ♦ న్నించు టెటులు?

మహా—దేవా! ఇట్టివిషయంబులందు మన మాగ్రహింపఁ గాదు. పోనీయని మనమిప్పు డూరకొనినచోఁ జిలికి చిలికి గాలివాన యగునట్లు మనరాజ్యంబాక్రమింతురు. అప్పుడు తమరు నిలువచ్చి నయట్లు మనమందునిలుచుటకు నీడయైనను లభింపదు. ఒకానొకవేళ నీడలభించినను జీవచ్ఛవంబులమై యుండవలయునేగాని మరియొండు గాదు. కావున గురువునకీవిషయాంబులు నచ్చఁజెప్పి యీదేవబాధమును దటిమి సేయవలసినదిగా బ్రార్థించుట యుత్తమము

వృష—అందులకే గాదా నేనే స్వయముగా బయలుదేఱివచ్చితిని. ఆతనిని మనదగ్గఱకుఁ బిలిపింపఁగలిగిన సమర్థత నాకుండియు నేనే స్వయముగా వచ్చి ప్రార్థించినచో గురువునకు నాయందభిమానము వృద్ధియగునను నాశతోడ నేగఁదావచ్చితిని. (అని సేవకునితో) ఓరీ! నీవు లోనికేఁగి గురువుగారితో మదీయాగమనం బెఱింగింపుము.

సేవ—చిత్తము. (అని నిష్క్రమించును)

వృష—మహాబలా!

తే॥ గీ॥ మనము నందలిక్రోధంబు ♦ మాటుఁబఱచి
తొలుత బ్రతిమాలి బోధింప ♦ వలయుమనము
అటులవినకున్న నింకెటు ♦ లతఁడువినునొ
యటులఁజేయుట తుదికార్య ♦ మగునుమనకు.

మహా—కాకయున్నచో దమయంతటివా రరుదెంచి రనుటలో విశేషమేమున్నది?

సేవ—(ప్రవేశించి) లోనికిదయచేయుఁడని గురువుగారి యనుమతియైనది.

వృష—(తలఁబంకించుచు) అమాత్యవరా! చూచితివా భార్గవుని పాడుబుద్ధి. మనల నాహ్వానించుటకైన నాతఁడెదురు రాడయ్యెనే?

మహా—ఎందులకువచ్చును? దేవతలపై మక్కువెక్కువైనది. ఆకారణమున మనలనుఁ దృణముపోలెఁ జూచుచున్నాఁడు. దీనికిఁదగిన ప్రతిక్రియ రొనరించినచోఁ దొంటియట్లు బుద్ధిగలిగి మసలుకొనును.

వృష—కానిమ్ము. (సేవకునితో) ఓరీ! లోపల నెవరెవరుండిరి?

సేవ—గురువుగారును, వారికుమార్తెయు నున్నవారు.

వృష—ఇంకెవ్వరును లేరా ?

సేవ—లేరు. లేరు.

వృష—కచుఁడు నీకగపడలేదా ?

సేవ—బాగుగా బరికించితిని లేడు.

వృష—సరే నీవుపొమ్ము. మంత్రీ ! మనములోనికరుగుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

(తెఱలేచును.)

[శుక్రుఁడును దేవయానియుఁ గూర్చుండియుందురు.]

శుక్రు—అమ్మా ! నీవనిన యటుల రాజుగౌరవార్హుఁడే కాని-

తే. గీ. తనకు జోక్యంబు లేనట్టి ♦ పనులలోనఁ
జేయిఁజేసుక ప్రజల హిం ♦ సించుచున్న
భూపతినిగాంచి యేరికి ♦ ముదముతోడ
గౌరవము చేయ సద్బుద్ధి ♦ గలుగు నమ్మ !

అదియునుంగాక,

సీ. తనకంటె బూజింపఁ ♦ దగినట్టి పెద్దలఁ
గణుతిసేయని యట్టి ♦ గర్వమున్నఁ
బ్రజలసౌఖ్యము గోరి ♦ పాలింపవలెనను
మహిత ధర్మంబును ♦ మరచియున్న
విప్రక్షత్రియులెల్ల ♦ మచ్చికల్పఁచియుంప
వెగిరబడు నవి ♦ వేక మున్న
జనుల నేకింపచెడి ♦ చట్టముల్ సృజియింప,
లేనట్టి స్వాతంత్ర్య ♦ మూనుచున్నఁ
బ్రజల మైక్యమెం రాష్ట్రింపు ♦ బల మటంచు
మనమునందైన దలపని ♦ మాంద్యమున్న
ధరణి పతిఁగాంచి యెవరైనఁ ♦ దగినయట్టి
మన్ననము జూపఁగలరొక్కొ ♦ కన్నతల్లి !

దేవ—జనకా! ప్రజల యనుమతిప్రకారము వారిస్వేచ్ఛకు వారి సకలైశ్వర్యములకు వారి మాన, ప్రాణంబులకు భంగంబు వాటిల్లకుండఁగాపాడిదుర్మార్గులనుశిక్షించి ప్రజాహితంబుగా రాజ్యము బరిపాలింపవలసిన ధరణీశ్వరుఁడిట్టి సర్వస్వాతంత్ర్యమూనుట కేమి కారణము ?

శుక్ర—అమ్మా! భూపతిస్వభావముచేతఁ దొలుదొల్త మంచివాఁడేయగును వాని నాశ్రయించిన దుష్టపరివారమే వానినన్యాయమార్గంబునఁ బెట్టుచుండును. ఐశ్వర్యమదాంధుండగు కతంబునను, రాజులకు వీనులేనయనంబులను నార్యోక్తిప్రకారంబునను సత్యాసత్యంబులు గ్రహింపఁజాలక, తానువినిన కొండెములే న్యాయములని తలంచి, ద్రవ్యక్రియ కేమిచేయ వలయునో వారితోడనే యాలోచించి వారియనుమతి ప్రకారమే చేయుచుండును.

దేవ—అట్లయిన భూపతి దండ్యుండెటగును.

శుక్ర—కీలకమిచ్చటనేయున్నది. తానువినినది యెంతవఱకు సత్యమో గ్రహియించి, యెట్లొనరించిన బ్రజలకుపకారము గలుగ కుండునాయని దీర్ఘముగా నాలోచించి, తద్విషయమై మంత్రులతోడను; బ్రజానాయకులతోడను; ముచ్చటించి న్యాయంబుగనిపెట్ట కన్యాయంబుగా దన్నాశ్రయించిన దుష్టులయిష్టప్రకారమొనరించుచుండుట చేతనే భూపతి దండ్యుండగుచున్నాఁడు.

దేవ—అట్లయిననృపవర్యుఁడుగూడ నిట్టిమందప్రజ్ఞుఁడాయెనా?

శుక్ర—ఇంకను సందేహమా? [ముందునకుఁజూచి] అదిగో! వృషపర్వుఁడు మంత్రితో నిటువచ్చుచున్నాఁడు. ఈప్రసంగమిఁక గట్టిపెట్టుము.

[అప్పుడు వృషపర్వుఁడు, మహాబలుఁడు బ్రవేశించుచున్నారు.]

వృష—ఆచార్యోత్తమున కభివాద మొనర్చుచున్నాను.

మహా—పూజ్యులగుగురువర్యులకభివందన మొనరించుచున్నాను.

శుక్ర—అభీష్టసిద్ధిరస్తు. ఇటఁగూర్చుండుఁడు. [ఇరువురును గూర్చుందురు.]

నృప—గురుపుత్రీ! క్షేమముగానుంటివా?

దేవ—(తనలో) మనసునిండుగ విషమున్నను మర్యాదలకు మాత్రములోపమెన్నడును లేదు. (పయికి, ఆహా! క్షేమముగానే యున్నదానను.

శుక్ర—రాజా! పాదచారివై వచ్చితివేమి?

నృప—మహాత్ముల యాశీర్వచనము బడయు కొఱకు.

మహా—తమయాశీర్వచన బలమీగదా మమ్మిట్టి యౌన్నత్యమునకుఁ దోడ్కొనివచ్చినది.

శుక్ర—[శిరఃకంపనమాచరించుచు] రాజా! నీతో నొకయంశము ముచ్చటింపవలసివచ్చినది. ఆప్రసంగము నీకుఁగొంచెము కష్టముగా నుండవచ్చును. కాని ప్రసంగింపకతప్పదు.

నృప—[మహాబలునకు సంజ్ఞయొనరించి, గురునితో] తమరు నాతో నెట్టిప్రసంగమొనరుపఁదలఁచినను నాక్షేమముగోరియే ప్రసంగింతురని యెఱుంగుదును. నాకేయియుఁ గష్టముగా నుండదు. అడుగవచ్చును.

శుక్ర—సర్వకాల సర్వావస్థలయందును నేను నీక్షేమమునే గోరుచుండ నీవునాయెడ గౌరవప్రపత్తులువీడి నాకపఖ్యాతివచ్చు కార్యమొనరించుట నీకుభావ్యమా?

నృప—తమపాదంబులాన, నేనెన్నఁడట్లుతలంపలేదు. తలపను. తలంచుట కవకాశములేదు. తానుగూర్చుండుటకాధారమైన కొమ్మనే నఱకికొని చెడి మందభాగ్యుండుండునా? ఎవ్వరోదుష్టులిచ్ఛ... ములకై తమతోనిట్లు నాపైఁగొండెములు జెప్పియుందురు.

మహా—ఆవాక్యములాలించి తమరు మాయెడననుమా... చుండిరేగాని మఱియొండుగాదు.

శుక్ర—ఎందులకీ యనంబద్ధాలాపములు? నేనునీవలెనే బ... జెప్పెడివాక్యంబులను విని త్వరపడువాడనుగాను. న్యాయముగాన... యేయిట్లడుగుచుంటిని.

వృష—అటులయిన మీకపఖ్యాతివచ్చెడి కార్యమేమాచరించితినని మీయభిప్రాయము?

శుక్రు—నీవీమధ్య నాకేవిధమైన నపకృతియు జేయలేదని యే నీయభిప్రాయమా?

వృష--బుద్ధిపూర్వకముగా జేయలేదని ధైర్యముతో జెప్పగలను.

[శుక్రు]—నా శిష్యుడగు కచుని యరణ్యమధ్యంబున జంపించుటలో నీయభిమతంబేమి?

వృష—[మహాబలునకు నేత్రసంజ్ఞయొనరించి] కచుడెవరు?

శుక్రు—కచునే యెఱుంగవుగా? ముకుందుడును, నీకుమంత్రియు దెల్పిన కుటిలవాక్యంబులాలించి యాతని జంపుట కాజ్ఞయొసంగుటయే నీవెఱుంగవుగా? వారిరువురు నీకెఱింగించిన యంశములెంత వఱకు సత్యములో నాతో నంప్రతించుకొనకుండ నీయంతటనీవు స్వతంత్రించుటనీకు దగునా? మృతసంజీవనీ మంత్రమొరులకొసంగవనని యే భావించితివా? నీవింత మందమతివై పోతివేమి?

వృష—గురువరా! ఇంతవఱకు వచ్చిన పిమ్మట దాచుకొనుటెందులకు? జరిగినదంతయు మీరెఱింగియేయున్నారు. మీరుజెప్పిన విషయంబులన్నియు నాలోచింపవలసిన యగత్యముగాని-మీతో నంప్రదించుకొనవలసిన యగత్యముగాని నాకిసుమంతయు లేదు. నేను బాలుడనుగాను. ఏదియెట్టులొనరించిన నాకుక్షేమమవో యట్లూహింపగలశక్తి పరమేశ్వరుడు నాకుగూడ నొసంగియున్నాడు. అది యెట్లనంగా.

ఉ॥ వారికి మీకునున్న మైత్రియు ♦ వారికి మాకును నెల్ల వారికిన్
దీరని వైరముండుట, సు ♦ ధీవర! మీరలెఱింగి యుండియున్
గోరిన యంతమాత్రమున ♦ గూర్మిదలిర్ప విరోధి సూనునిన్
జేరగదీసి విద్యలను ♦ జెప్పుచునుండుట మీకు భావ్యమే?

గురువర్యా!

ఉ॥ అట్టుల వైరిపుత్రకుని ♦ యాదరచిత్తత మీరు గోరిన నే
నెట్టులనెంచగా వలెనో? ♦ యెంచెడి మీమనమందు నేన యు

ష్టునని ట్టిఁ జేయఁ దమ ♦ భావమునందున నెట్టులెంతురో
గట్టిగ నెంచిచూచి యిది ♦ గాదని యిప్పుడు నాకుఁ దెల్పుడీ!
ధర్మమందఱకును సమానమేగదా?

మహా— అయ్యది ధర్మముగాని ముందు వెనుకలరయక యిట్లు మందలించుట ధర్మమగునా?

శుక్రు—ఓ ధర్మస్వరూపా! మహాబలా! విరోధియైనను సరియే, విహితుఁడైనను సరియే. మనకాచింతన మనవసరము గాని—

తే॥ గీ॥ ప్రాజ్ఞుఁడును, బ్రహ్మచారియు, ♦ బ్రాహ్మణుండు,
విదితయశుఁడును, జనుదెంచి ♦ వేడినంతఁ
దెలిసినటువంటి విద్యలఁ ♦ దెలియఁజేయ
వలయు నిది విప్రధర్మంబు ♦ తెలియవొక్కొ.

నీకుఁ దెలియనివానిలో నీవు ప్రవేశింపకూరకొనుము. వృషపర్వా దీని నేమనో గర్వమందురు, రాజా! ఆయంశమటుంచుము. నేను కచునకు విద్యాబోధన మొనర్చుటవలన నీకు వచ్చెడి ముప్పెయ్యదియో యించుకెఱింగింపుము.

వృష—భార్గవా! ఆవిషయము తరువాత ముచ్చటించుకొన వచ్చునుగాని—విరోధిని మనగుహ్యములో నడుగుబెట్టనిచ్చుట మీతప్పగునా? కాదా? అట్టివాని ప్రవేశమునకు మీరనుమతించుటవలన మనరహస్యములన్నియు వైరులెఱుంగుట కవకాశము గల్పించినవారైతిరా? లేదా? మనరహస్యములన్నియు వారెఱింగినచో మనకు వారివలన ముప్పువచ్చునా? రాదా? ముందు వెనుకలాలోచింపక మీరాతనియునికి కనుమతించుట దోషమగునా? కాదా? ఆర్జవమునన్నైన, ననార్జవమునన్నైన శత్రునాశన మొనరించుకొనుట న్యాయమగునా? కాదా? అది రాజనీతియగునా? కాదా? నాయన్నముదినుచు నాకే యపకృతివలుప నెంచిన మీతో సంప్రదించుకొనవలసిన యగత్యము నాకేమైనన్నదియా? మీరే యాలోచింపుడు.

శుక్రు—[క్రోధముతో] ఆఁ. ఆఁ. రాజ్యమదాంధా! ఏమంటివి? నేను దినునది నీయన్నమా? నీకేమైన మతియున్నదా? లేదా?

నీవాపాదసేవకుఁడరా తుచ్ఛుఁడా! 'నీ' యనుటలో నర్థమేమిరా రాజాధమా! ప్రజలనేడ్పించి బడసిన ద్రవ్యమేనా నీయది? అయ్యది ప్రజల సొమ్మా? నీతాతగారిముల్లెయా? నీవును, నేనును, మహామంత్రులమని పేరుఁబెట్టుకొనిన నీగొప్పయుద్యోగియులును దినునది యెవరిసొమ్మురా యవివేకీ! సర్వవిధముల ప్రజలనేడ్పించి బలవంతముగా వారిధనధాన్యములను వివిధపన్నులరూపేణా గ్రహియించి వారికి వలయు సౌకర్యంబులు గల్పింపకింటఁబడవైచుకొనినధనమేనా నీది? ప్రజలెల్ల రేకగ్రీవముగా నడిగినచో వారికేమి సమాధాన మీయవలయుననుకొంటివి? వారిద్రవ్యమునకు మనమెల్ల నుత్తరవాదులమనుమాట మఱచితివిరా మూర్ఖా! ఏమనీ యవివేకము? [తీవ్రస్వరముతో] వృషపర్వా! నీపైననే నాకుఁగ్రోధమున్నయెడల-నిన్ను నాశనమొనరింపవలయుననేఁడి కోరికయే నాకున్నయెడల-యీరాక్షసలోకమెల్ల నాకలోకవాసుల కర్పింపఁదలఁచియేయున్నయెడల నాకెంతవాటిదిరా? నిన్నధఃపాతాళమున కణచివైచుటెంతలోనిదిరా మూర్ఖా! అట్టియుద్దేశమే నాకున్న యప్పుడు ముమ్మాఱు రణోర్విని బాణంబులన్వర్షించి నన్ను మరల, మరల మృతసంజీవనీ మంత్రముచే బ్రదికించుమననుకొంటివా? అట్లుబ్రదికించుట కేమికారణమనుకొంటివి?

వృష—ఆనాఁటికి మీకుమార్తె యౌవనవతి కాకపోవుటచేత.

శుక్ర—అనఁగా—

వృష—అప్పటికి మీకుమార్తె యౌవనవతి కాకపోవుటచే మీకు రెండవచింతయుండెడిదిగాదు. ఇప్పుడామె నవవయోవిలాసినియగుటచేయామె కుద్వాహమొనరింపవలసిన సమయమరుదెంచినది. అందుచేత నామెకనువగు వరునన్వేషించెడి బాధ్యత మీదైయున్నది. సకలవిద్యావిశారదయగు మీతనయ నెవ్వనికొసంగుటయా యని మీరు సంశయించుచున్న సమయంబున నీకచుఁడరుదెంచెను ఆతనిరూపురేఖవిలాసాదులు మీరుచూచితిరి. మీకుమార్తె కుఁదగినవాఁడని భావించితిరి. ఆభావముదయించుటచేతనే మీకును, మాకును గల విరోధమున్నైనఁ బాటింపకాతనిని మీయాశ్రమములోననే యుంచికొంటిరి

మీకొమరితె సిగ్గుబిడియములు విడచి కచునితో మంతనములాడుట జూచి మీరు గనుక సమ్మతించిరి. పరువుమర్యాదలు గలవాఁడెవ్వఁడైన నైనచో యిందులకనుమతించునా? కచునకు మీకుమారీమణి నిచ్చి యుద్వాహ మొనరింప వలయునని నిశ్చయించుకొంటిరి గావుననే యనుమిషులపైననురాగంబును-మాపై ద్వేషమును గల్గినది

శుక్ర—[క్రోధముతో] అబ్బా! ఏమియపూర్వజ్యోతిషము. ఉన్నదున్నట్లుగా గనిపెట్టితివే? నేనిదివఱకావిషయమే యూహించి యుండలేదు. ఈమహాతంత్రము నీకొమరితయును, ముకుందుఁడును గలిసిఁబన్ని నీతో వచించి నీకాగ్రహము దెప్పించిరేగాని నీవనుకొనిన దానిలో నించుకంతయు సత్యములేదు. నామాటనమ్ముము,

మహా—ముంజేతికంకణమునకద్దమేల? మీచేతలే మీయభిమతమెఱింగించుచుండ మీమాటలు సత్యములని నమ్ముటకవకాశములేదు.

వృష—నిజము. నిజము. ఆమాటలట్టుండుఁడు. కచుని స్వస్థానమునకుఁ బంపించివేయుఁడు. మీవాక్యములను నమ్మెదను.

శుక్ర—ఆకచుఁడు విద్యనొసంగుమని నన్నుఁగోరెను. నేనొసంగెదనని వాగ్దానమొసంగితిని. ఇప్పుడు నాప్రతిజ్ఞాభంగమొనర్చుకొని యాజన్మకాలమును నిందననుభవింపఁజాల. కావున వానిని బొమ్మనుట కవకాశము లేదు.

వృష—అట్లయినచో కచునిపై ద్వేషము నేనెట్లువిడువఁగలను.

మహా—కచునిపై ద్వేషమువిడచినచో మనజీవములపై నాసఁ గూడ విడువవలయును.

వృష—ఈమాటమాత్రము నిజము.

శుక్ర—కచుఁడు నీకెట్టి యపకృతియు సేయఁడు.

వృష—చేయనిండు చేయకపోనిండు. మేము మెలకువగా నుండక తప్పదుగదా?

శుక్ర—అట్లయిన నామాటలు నమ్మవా?

వృష—నమ్ముటకవకాశములేనిదే నమ్ముటెట్లు?

శుక్ర—నేనుగూడ నీకపకృతి జేయుదునని యే దలంచితివా?

వృష—పుత్రికా ప్రేమ మందలి నాయెడల మీకభిమానముండదు.

మహా—అదియు నిజమే.

వృష—అందుకొఱకు మిమ్మిరువురనుఁగూడ శిక్షించి నామార్గము నిష్కంటకముగా నొనర్చుకొనక తప్పదు.

శుక్ర—[క్రోధముతో] అట్లనా? దోషంబులన్నియు నీకడ నుంచుకొని మీఁదుమిక్కిలి నన్న నరానిమాటలాడుచుంటివా? హూమ్. హూమ్. నీకుఁ జేతనైనటుల నన్ను శిక్షించుము. హూమ్. నీదౌర్జన్యములెంత కాలము సాగునో చూచెదను. [తీవ్రక్రోధముతో శిష్యువైపుఁ జూచి] కచా! కమండలోదక మిటు తెమ్ము.

వృష—[గడగడ వడఁకుచు శుక్రునిపాదములపైఁబడి] ఆచార్యోత్తమా! అనుగ్రహింపు డనుగ్రహింపుడు. ఒడలు దెలియని క్రోధపిశాచము నన్నావహించుటచే నేమేమియో దుర్భాషలాడితిని. వాని నన్నియు మన్నించి నన్ను రక్షింపక తప్పదు.

కచు—[కమండలోదకముతో బ్రవేశించును.]

శుక్ర—[క్రోధముతో] నీవొనర్చిన దౌర్జన్యమునకు క్షమాపణకనర్హుఁడవు.

వృష—అగుఁగాక.

ఆ॥ వె॥ సుతుఁడు బల్కినట్టి ♦ మతి లేని మాటల
మెచ్చి జనకుఁడతని ♦ మనుచు నటుల
నేను బల్కిన యవి ♦ నీతి వాక్యములను
భావమందు నిడక ♦ బ్రోవుఁ డయ్య.

శుక్ర—నీ మొండితనమునకు నాకు నవ్వువచ్చుచున్నది. అందినఁజుట్టును నందకయుండిన గాళ్లను బట్టెదవు. మొండివాఁడు రాజుకంటెను బలవంతుఁడు. నీవు రాజువు. మొండివి. ద్విగుణీకృతబలము నీకున్నది. ఏమైనను నీవు హంతవ్యుండవుగాని క్షంతవ్యుఁడవుగావు.

వృష—స్వామీ! మీరిట్లనుట భావ్యమా? ధర్మావతారావతారులగు మీరెఱుంగని దేమున్నది? శరణన్నవారిని రక్షించుటయే ధర్మవ్యాపారులవిధికృత్యము. శరణని మీపాదములపై వ్రాలితిని. రక్షింపకుండుట భావ్యమా? ఆచార్యోత్తమా? క్షమాభిక్ష పెట్టుడు.

శుక్రు—నీవుక్షమింపఁబడుట కొక్కనూతియున్నది.

వృష—ఎద్దియో సెలవిండు.

శుక్రు—నాయిష్టప్రకారమాచరించెదవా?

వృష—తప్పక మీ యాజ్ఞాబద్ధుఁడ నయ్యెద.

శుక్రు—రాక్షసేశ్వరా!

ఉ॥ వంచియుచెడ్డయుక్తిఁ దొలఁగి ♦ మాప్రియశిష్యునిపైనఁ గొండెముల్
బెంచి వచించి నీ యఱక ♦ పెంపొనరించి వధింపనాజ్ఞ బు
ట్టించిన నీదుపుత్రికను, ♦ డింభకుఁడైన కచుండు నీవు శి
క్షించిన పిమ్మటా కచుని ♦ చెచ్చెరఁ బ్రోచిన నిన్నుఁ గాచెదన్.

ఇట్లొనరించెదనని నాపదములంటి శపథమొనర్తువేని నాక్షమాభిక్షఁబొందుట కర్హుండవయ్యెదవు.

వృష—మీయాజ్ఞాబద్ధుఁడనై శర్మిష్ఠాముకుందులను శిక్షించి, కచుని రక్షించెదనని మీపాదద్వయంబుపైఁబడి ప్రతిన యొనర్చుచున్నాను. నన్నును, నావంశమును రక్షింపుఁడు. దురాగ్రహావేశంబున నొడలు దెలియకాడిన నావాక్యములు మన్నింపుఁడు. [అని కాళ్ళపైఁబడును.] *

శుక్రు—సంతోషము. [అని వృషపర్వుని లేవనెత్తి] అటు గూర్చుండుము.

వృష—[విన్నదనముతోఁ దనయాసనముపైఁ గూర్చుండును.]

శుక్రు—కచా! అపవిత్రోదకము వారిరువురకును నొసంగుము.

వృష—[తనలో] ఎంతదురవస్థవచ్చినది. [అని దోసిలొగ్గి జలమును స్వీకరించును]

మహా—[స్వీకరించును]

శుక్రు—రాక్షసేశ్వరా! అగ్రిహావళంబున నడుగమరచితిని. నిన్నింతవఱకు దోడ్కొనివచ్చిన రాజ్యకార్యమేమయియుండునని?

వృష—గురువరా! ఆపనియు నీసంభాషణలో దీఱిపోయినది. సెలవొసంగినచో వెడలెదము.

శుక్రు—అట్లయిన సంతోషము వెడలిరండు.

[మహాబలుఁడును వృషపర్వుఁడును నీవలకురా దెలివాలియును.]

వృష—[ఇటు నటుఁజూచి] మహాబలా! వ్యవహారమెట్లు పరిణమించినదో చూచితివా? నిష్కారణము శపించునేమోయను భయంబున శరణనవలసివచ్చినది. కానిమ్ము. అంతమాత్రమున నాగౌరవమున కేమియు లోపము లేదుగాని యాదేవతాధముఁడొసంగిన యుదకము గ్రహింపక దప్పినదిగాదని విచారించుచున్నాను. వానిఁగాంచిన నాకత్రికాలిమంట నెత్తికెక్కుచున్నది. కచుఁడు జీవించియుండునంత కాలమును మృతసంజీవనీమంత్రము దేవతలపాలయి పోవునేమోయను భయముమాత్రము నన్నువిడచుటలేదు.

మహా—నిజము నిజము. మనకావిషయమున సందేహముండవలసినదే.

వృష—ఈమారు కచునిఁబట్టి వధించి యొకసంచిలోబెట్టిమూతిబిగించి, మఱలరజ్జుబంధనంబొనరించి నడిసముద్రములో బారవైవ నాయాజ్ఞగాదెల్పి యీకార్యమునకై ముకుందుని నియమింపుము. ఈమారు శుక్రుఁడు మృతసంజీవనీ మంత్రముచే వానిని బ్రతికించినను గచుఁడు మాత్రము దరికిరాలేక కలవానమునగ్గి మఱలఁజచ్చును. గురుఁడువెండియు బ్రతికించుననుకొమ్ము. అతఁడు మఱలఁజచ్చును. అటు విమ్మటేమినడచునో చూతము. మనమీకార్యము వేగముగా నిర్వర్తింపవలయును గాన వేగముగా బోవుదమురమ్ము.

[నిష్క్రమింతురు.]

తృతీయాంకము.



శ్రీ

# మృతసంజీవని

అను

# కచ-దేవయాని.

తృతీయాంకము.] [విష్కంభము.

—✱ స్థలము:—రాజబాట. ✱—

[ముకుందుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ముకుం—[తనలో] అనవసరముగా వృషపర్వుఁడు గనుక కాళ్లమీఁదఁబడి శరణనినాఁడుగాని-నేనై తేనా?-మళ్ళీ మాటాడుటకు వీలు లేకుండా-శపించుటకు నోరెత్తకుండా-కనుక్కొన వలెనికి తీరుదును. అయితే నాకంతధైర్యమున్నదా? లేదా? యని సంశయించుచుంటాను నానందేహనివృత్తియగునట్లు మొన్నఁగచుని జంపితినిగాదా? అప్పుడు నేను క్రిందఁబడిపోతిననియే యనుకున్నారట " తెలివితక్కువవాళ్లు. తెలివితక్కువవాళ్లాని.' అని సులువుబలువులు వారికెట్లు తెలియును? క్రిందఁబడినట్లుభినయించి-క్రిందనుండి పైకి "దుసెల్లి" పోవునట్లు పోడి చితినిపోటు. ఇంతేఁదుకు? నిన్న రెండోమారెంత సులువుగాఁగచునిఁ జంపి నడినముద్రములో పారవైచితిని. ఇంకనా కచుఁడుమాత్రము సముద్రములోనుండి బయటకు రాలేడు. బ్రతికించుటకే కావున చింత మంత్రమున్నదిగాని-రజ్జుబంధనమునడలించుటకుమంత్రము లేదుగదా? అందుచేత గురువుగారు బ్రతికించినా కచుఁడుమాత్రము బైటకురా లేఁడు. వెంటనే కడివెడునీళ్లు తాగి కచుఁడు మరలకడతేరును. లేక పోతే యేతిమింగిలమో మాత్రిమింగినట్లు మింగివేయును. ఆదెబ్బ

తో కచుఁడు మరల బ్రదికినా తిమింగిలము కడుపులో నుండవలసిన దే
గాని బయటకురాలేడు. అప్పుడు దేవయాని యింకేమిచేయును?
నెత్తియు నోరును గొట్టుకొని యేడ్చును. రెండవదిక్కులేకనన్నే పెండ్లి
యాడితీరును. ఈశ్వరుఁడురక్షించి నేననుకొనినట్లు జరిగినచో నాభాగ్య
మప్పుడడుగనా? దేవయానీ మనోహరుఁడనై-శుక్రాచార్యునకల్లుఁడ
నై-రాజనకాత్మీయుఁడనై-దేవతలకుఁ బ్రక్కలోనిబల్లెమునై-ఒక్క
వెలుఁగు వెలుగు తానన్నమాట. నాకుమంచిదినములు దగ్గఱబడినవి.
"వచ్చెడి కాలముకంటె బోయిన కాలమే మంచిద"ని పెద్దలనెదరుగాని
నాకుమాత్రము బోయినకాలముకంటె వచ్చెడికాలమే మంచిదిగా
గనఁబడుచున్నది: [అని రెండడుగులువైచి] ఓహో! రేపుశర్మిష్ఠజన్మ
దినముగదా? ఆమెయనుగ్రహము సంపాదించుకొనుటకై యేదియైన
బహుమాన మొసంగినచో బాగుండును. ఏమియిచ్చినచో బాగుండును.
వారికిదొరకనివస్తువిచ్చుటమంచిది. [ఆలోచించి] మామంచియాలో
చనతట్టినది వారికన్నియుఁదొరుకునుగాని "బుఱ్ఱగుంజు" మాత్రము
దొరకదు, దానికున్నరుచిదేనికిని లేదు. కనుక మంచి "వడతకొక్కు"
లనుదీసి యొకపళ్లెమునిండునట్లు గుంజుదీసి బట్టుకొని కడలి శర్మిష్ఠకిచ్చి
నచో జాలసంతోషించును. అప్పుడు దేవయానిపైనొక్కపొడి తగిలిం
చినచో-ఆమెతండ్రితోఁజెప్పితీరును. అతఁడు దేవయానిని నాకిచ్చి
పెండ్లిజేసితీరును, కనుక యింటికి వెడలియాప్రయత్నము జేయ
వలయును.........ఈశ్వరా! నాకిటువంటి మంచియూహతోఁపించి
నందులకు నీకొకపదివందనములు బుచ్చుకొమ్ము.

[అని నమస్కరించి నిష్క్రమించును]

ఇ ది వి ష్కం భ ము.



## ప్రథమ రంగము.

—♦ స్థలము:— శర్మిష్ఠ భవనము ♦—

[శర్మిష్ఠయుఁ గొందఱు చెలులును సోగటాలాడుచుండఁగాఁ దెఱలేచును.]

శర్మి—[ఆటముగిసినపిదప] చెలులారా! ఇప్పటి యాటలన్నియు ముగిసినవి. ఫలాహారములకుఁ దరుణమాసన్నమైనది. నళినీ! ఇంతదనుక దేవయాని రాకుండుటకేమి కారణమో యెఱుంగుదువా?

నళి—నాకేమియుఁ దెలియదమ్మా!

శర్మి—నళినీ! మరల నీవటకేగి దేవయాని బిలిచి తోడ్కొని రమ్ము. అప్పటికిని యామె రాకున్నచో ముందుపని ముగించుకొందము.

నళి—చిత్తము. [అని నిష్క్రమించును.]

శర్మి—[తనలో] నాజన్మదిన మహోత్సవములో దేవయాని పాల్గొనకుండుటకేమి కారణము? [ఇంచుకసంశయముతో] ఒకానొకవేళ నేనుఁగూడ నీకుట్రలో జేరితినని యామె యనుమానించుచున్నదా? లోపల నట్టికుళ్లున్నదియో గాని-పైకిమాత్రమట్టి భావమేమియుఁ బొడగట్టుటలేదు. మరల జంపించి నడిసముద్రములో బారవేయించిన కచునికొఱకు బెంగఁబెట్టుకొని-మంచముబట్టి కరుగుచున్నదా? అట్టివిచారమున్నట్లునుఁగానరాదే? నిన్న సాయంతనధ్యానమయినపిదప నేగదా నే నామెనుజూచితిని. అతనికొఱకై దుఃఖించుచున్నట్లులేనిఁ గానరాదే? కారణమేమియో తెలియదు. ఏదియెట్లున్న నామెమాత్రము నాయెడ మూకీభావమువహించి యున్నట్లూహింపక తప్పదు. ఆమె భావమును బట్టిచూచినచో నేనీకుట్రలో జేరితినని యామె యనుమానించినట్లే యున్నది. [నిరసనభావముతో] ఉండనిమ్ము. కాకిపిల్ల "పేదవానికోపము పెదవులచేట"ని యెఱుంగకున్నది. అనుమానించి నన్నేమి చేయఁగలదు? చేయుటకుండగిననర్హతయేయున్న జేయఁగలిగినదేదియో యీపాటికిఁ జేసియేయుండును. అంతపాటి శక్తియామెకెక్కడిది? ఇప్పుడు విందునకుఁ జనుదెంచు నీమె నీచెలికత్తియలముందఱ అవమానించి, యామెపై నపకారమునకుఁ గట్టిపెట్టినఁగాని యీమెగర్వమణఁగదు. నాక్రోధమణఁగదు.

[అప్పుడు దేవయాని ప్రవేశించుచున్నది.]

దేవ—[తనలో]

మ॥ తనశాపంబున నేమి గాదలఁచి యా ♦ దైత్యాధముండట్లు శు
క్రుని పాదంబులబట్టి "యాకచునిపై ♦ క్రోధంబువర్జించి బ్రో
తునటంచుర్" శపథంబొనర్చి మరలన్ ♦ దుష్టాత్ముఁడై పాప మా
తని ద్రుంచి సముద్రమధ్యమున నే♦ ధైర్యంబుతో ద్రోసెనో?

క్రోధపిశాచమావహించి, యుక్తాయుక్త జ్ఞానమంతరింపజేసిన నిమ్మట ధైర్యమునకేమిలోటు? క్రోధము ముందువెనుక లాలోచింపనీయదుగదా? [ఆశ్చర్యముతో] ఓరా! నాజనకుని మహిమాద్భుతంబులు స్వయముగాఁగాంచియు, ననుభవించుచునుగూడ నీతని పెట్టికుదురకున్నదే? ఓరా! ఏమి విధి మాహాత్మ్యము. [రాక్షసరాజు నుద్దేశించి] ఓవృషపర్వా!

ఉ॥ ఒక్కఁడనాడు తండ్రివైరి ♦ యొక్కఁడ నేనుఁగ చుండనంగ పెం
పెక్కినప్రియతో మహత్త్వ ♦ టీవు స్వయంబుగ జూచియుండియే
ఫక్కి జయంబు గాంతువని ♦ భావము నందడి గానబోని తో
ముక్కఁడి రక్కసాధమ! స ♦ మగ్రము వానిని జంపఁ జాలునే.

నీపూర్వపుణ్య విశేషంబున నీవురాజవైతివిగాని రాజునకుండవలసిన సద్గుణంబులేమియు నీకడ గానరావు ఓమందబుద్ధీ! నాజనకుఁడు తనప్రియకుమారీమణి కోర్కెచెల్లింప నూహించుచుండును గాని నీయభిమతమీడేర నీయఁదగినయెఱుంగవా? నీకీయత్నమునఁబరాజయమే గాని జయములభింపదని యెఱుంగవా? ఈమారుగూడ నీప్రయత్నంబేమైనదో వింటివా? నీవుమరల జంపించి నడిసముద్రమధ్యంబునఁబాఱవేయించిన కచుని-నేనొక్కఘడియలో వింటికిదెప్పించుకొంటిని. నాజనకునియొద్ద మృతసంజీవనీ మహామంత్రమున్నంతకాలము నాకెట్టి లోపమునులేదు నాతండ్రినాకోర్కెల్లదీర్చును. ఈమారుగూడ జయమునాకేలభించినది. ఇంకేమిచేసెదవో చేయుము. నీచాకచక్యమును జూపుము.

చ॥ చంపుటనీదువంతు మరి ♦ జచ్చినవారికి బ్రాణమిచ్చియుఁ గ్
రెంపుట మాదువంతు ఇట ♦ బెద్దజయంబు లభించునేటికో
తెంపరిచూడఁగాఁదలఁచి ♦ తే? యటులైనను నిల్వుమింక నీ
కొంపనుగూల్చి యాకమని ♦ కోరిక లీరిక లెత్తఁజేసెదన్.

ఇందుఁ బరిపూర్ణజయంబు లభించువఱకు నేనిక్కార్యమును విడువను. నీవును బరాఙ్ముఖతవహింపకుము. ఏమగునో జ్ఞాతము. రాక్షసలోక వినాశనమునకే నీకిట్టి దుర్బుద్ధిపుట్టినది. కానిమ్ము. [అని రెండడుగులు ముందునకు వైచి చూచి] అడిగో! శర్మిష్ఠ నాకొఱకెదురుచూచుచున్నట్లున్నది. [అని సమీపించును]

శర్మి—[కొంచము ముందునకువచ్చి] ఇంతయాలస్యముగా జనుదెంచితివేమి?

దేవ—నాజనకుఁడు పూజయొనర్పుటకై వలయు సామగ్రి నంతయు సిద్ధపఱచుటలో నించుకాలస్యమైనది.

శర్మి—అట్లనా? నీకొఱకే వేచియున్నాము. ఆటలన్నియు ముగిసినవి. ఇంక ఫలాహారములే మిగిలియున్నవి. గమ్ము. రమ్ము ఆలస్యం బగుచున్నది.

దేవ—సరేనడువుము. [ఇరువురును మిగిలినవారిని సమీపింతురు]

శర్మి—[అందఱను వరుసగాఁగూర్చుండఁబెట్టి తినుబండము లొసంగును. తరువాత యొక్కొక్క భృంగారములో సుర నందిచ్చును. అందఱును ద్రాగుదురు]

దేవ—[త్రాగక భృంగారము గ్రిందనుంచును]

సఖి—[ప్రవేశించి భృంగారములనుఁదీయుచు దేవయానికడకు వచ్చి] ఏమమ్మా! మీరు దీసికొనలేదు.

శర్మి—[చూచి] నీవేల నిది బరిగ్రహింపలేదు?

దేవ—దీనివలనఁగలుగు నష్టంబులన్నియు నీకిదివఱకొకమారు వినిపించియుంటినిగదా? అట్టినష్టంబు లుత్పన్నముఁజేయు సురాపాన మొనర్పరాదని ప్రతినబూనితిని.

శర్మ—[ఆశ్చర్యముతో] ప్రతినబూనితివా? ప్రతిజ్ఞబట్టిన ట్లిదివఱకేల నాకు దెలుపలేదు?

దేవ—అగత్యము లేకుండుటచే, జెప్పలేదు.

శర్మ—వెఱ్ఱిదానా! ఇంత వెఱ్ఱిబడుచుంటివేమి? నిజముగా దేహమునకీ మద్యమొనరించుచుపకార మింకేదియైన నొనర్పఁగలదా? కొన్నికొన్ని జాడ్యములకిది పెట్టినదిపేరు. బుద్ధి జాడ్యమడంచుటకిది గజాంకుశమువంటిది. క్రిములనపనయించుటకిది యమృతతుల్యమే. క్రొత్తయుత్సాహమును బుట్టించుటకిది యుత్తమోత్తమమైనది. ధైర్యమొసంగుటలో నద్వితీయమైనది. పిఱికిగుణము వాఱద్రోలుటకిది వజ్రాయుధము. ఏ కార్యమునకైనను నిది ముందంజవేయించును గాని కాలు వెనుకకు గదుపనీయదు. దీనిని సేవించువారికి స్వర్గము కరతలామలకమే గదా? ఆత్మగౌరవము నిలువఁబెట్టుకొనదలంచినవారీ మందు సేవింపవలసినదే. పౌరుషంబునకిది పట్టుఁగొమ్మ. ఇట్టి యుత్తమమైన దింకొకటిదియును లేదు. ఎన్నియని చెప్పఁగలను? తెలియనివారికైనను బూర్ణముగాఁ దెలిసినవారికైననుఁ జెప్పుటకష్టము లేదుగాని—తెలిసియుఁ దెలియనివారికి దెల్పుటకు బ్రహ్మదేవుని తరముగాదు. ఇంతెందుకు? నీమాత్రము దెలియకనే మనవారు మద్యపాన మొనరించుచుండిరా? నీజనకుఁడు నీకంటె బుద్ధిహీనుడని యెంచి భావించితివా? నీవు కచుని ప్రతిజ్ఞల కొక్క నమస్కారమొనరించి దీనిని సేవింపుము.

దేవ—నీకొక్క నమస్కారము. నన్ను బలవంతపెట్టకుము. నాప్రతిజ్ఞ నేను నిలువబెట్టుకొనక తప్పదు.

శర్మ—ఎవరిదగ్గఱ ప్రతిజ్ఞబట్టితివి?

దేవ—కచుని చెంత.

శర్మ—ఆతఁడిప్పుడిక్కడ లేడుగా?

దేవ—ఇప్పుడిక్కడ లేడని ప్రతిజ్ఞాభంగ మొనరించుకొంట దోషముగాదా?

శర్మ—ఇక్కడనేగాదు—ప్రపంచమువిూదనే లేడటగాదా?

దేవ—అమంగళము ప్రతిహతమగుఁగాక.

శర్మి—అమంగళమేమి?

దేవ—కచుఁడు జీవించియుండఁగా లేదను టమంగళముగాదా?

శర్మి—అతఁడు సముద్రమధ్యమునఁబడి చచ్చిపోయెనటగాదా?

దేవ—అతఁడు వ్యయముగాఁబడి చావలేదు. కొందఱుదుర్మార్గు లాతనినట్లు గావించిరి. కాని దైవకృపచేతను—మజ్జనకుని మృతసంజీవనీ మహామంత్రప్రభావముచేతను నాతఁడు మరల జీవించి నేఁటి యుదయమున గృహమునకు వచ్చియున్నాఁడు.

శర్మి—[భయముతో] నీవట్లనుకొనుచుంటివేమో? కచుఁడు నిజముగా జీవించెనా? నీమాటనిజమే.

దేవ—అట్లు భయపడెదవేమి? నీతో నేనసత్యమాడుదునా?

శర్మి—ఆతని నట్లుగావించిన దుష్టులెవ్వరు?

దేవ—ముకుందాదులు.

శర్మి—నాజనకునితో వచించి వారిని శిక్షించితీరెదను.

దేవ—నీజనకుఁడుగూడ నీకుట్రలో జేరియున్నాఁడు. నీతండ్రి నాతండ్రిని శరణువేఁడి ప్రాణములనుదక్కించుకొనినాఁడేను గాని లేకున్న నీపాటి కాతఁడీలోకంబుననుండునో యెవ్వరు చెప్పఁగలరు?

శర్మి—నిష్కారణముగా నిందింపకుము. నాతండ్రి యిట్టి పాపకార్యములలో పాల్గొనఁడు.

దేవ—[నిందాగర్భముగా] నీజనకుఁడు చాలవివేకశాలి. ఆతనికుమార్తెవు నీవాతనికంటెను వివేకశాలినివి. మీమీగుణగణంబులు నాయొద్దనా బాగడెదవు. "తల్లిపుట్టినిల్లు మేనమామయొద్దఁబొగడుట" వ్యర్థముగాదా?

శర్మి—[క్రోధముతో దేవయానివైపు జూచుచుండును.]

[అప్పుడు శర్మిష్ఠకెదురుగా కచుఁడు ప్రవేశించుచున్నాఁడు]

శర్మి—[కచునిఁగాంచి భయముతో గజగజవడఁకిపోవుచుఁ దనలో] అఁ- అ- దేవయానిపల్కులు నిక్కువము లే? అయ్యయ్యో! కచుఁడు మరల జీవించివచ్చెనా? ఎంతప్రమాదమెంతప్రమాదము. వీనినిఁక జంపుటకష్టమేనా? మాప్రయత్నములన్నియు వ్యర్థమైపోవల

సినదేనా? దేవయాని యీయాజితమన్మథునిఁ బెండ్లియాడి సుఖయించుచుండ నేనాజన్మకాలమిట్లు దుఃఖించుచుండవలసినదేనా? నాకులేని భాగ్యమీ నీచురాలికి గలుగవలసినదేనా? ఓయీశ్వరా! ముల్లోకములను గజగజలాడింపఁగల వృషపర్వమహారాజబిడ్డ నిట్లధోగతిపాలు జేసి—నాదయసంపాదించుకొని బ్రదుకవలసిన—నాకనుసన్నల మెలంగవలసిన—యీదేవయానికి—యీబ్రాహ్మణపుత్రికి—ఇట్టియెనలేని యాధిక్యమొసంగితివేల? ఈతనికి చావులేకుండ బుట్టించితివేమి నీబుద్ధిబుగ్గిగాను.

[అప్పుడు ముకుందుఁడు పళ్లెరముతోఁ బ్రవేశించి]

ముకుం—[ఆకస్మికముగా కచునింగాంచి] ఆఁ. ఆఁ. ఏమిది? కచుఁడు దయ్యమైవచ్చినాడా యేమి? [సందేహముతో] ఇది శర్మిష్ఠ గృహమేనా? తిమింగిలముయొక్క గర్భమా? అయితే కచునితోఁ బాటు మమ్మందఱనుఁ దిమింగిలము మ్రింగినదన్నమాటయే. [ఇటునటుఁ జూచి చేతిలోనిపళ్లెము జూచుకొని] అమ్మయ్య. నాచేతిలో బుఱ్ఱగుంజుతోనిండిన యీపళ్లెరముండుటచేత తిమింగిలము నమ్ము మ్రింగలేదని ధైర్యముదయించినది. ఏదియైననుఁ దిమింగిలముకడుపులో నుండిన నుండవచ్చునుగాని 'బుఱ్ఱగుంజుంటుందా మరి' కనుక నేననుకున్నంత ప్రమాదము జరుగలేదన్నమాటయే. నేను ధైర్యముతో నుండవచ్చును. అయితే కచుఁడు దయ్యమైవచ్చాడన్నమాటయాధిదమే. ఊరుకొంటే మమ్మందఱను బాధింపకమానఁడు. రాజుతో జెప్పి మారణహోమము జేయింపనలేనుగాని యూరకుండరాదు. [అని పళ్ళెరమక్కడ బాఱ వైచి పరుగిడును.]

కచు—[తనలో]

తే॥ గీ॥ గురువునకుఁ బ్రేమ నామీఁదఁ ♦ గుదిరె గాని
వెలయుచుంటిని యభిమత ♦ మెఱుకఁ బఱుపఁ
గోర్కె దెలిపిన పిమ్మటా ♦ కూర్మి తొంటి
యట్టులుండునో?—ఉండదో? ♦ యనెడు భీతి.

ఇది కేవలము నాదురభిప్రాయమేగాని గురువుగారట్టివారుగారు. [సందిగ్ధహృదయముతో] వృషపర్వుఁడు గురువుగారినంతగా ప్రార్థించుటచే ననుమానింపవలసివచ్చుచున్నది. గురువుగారు వృషపర్వుని కోర్కె నంగీకరింతురో? నాయభిమత మీడేరునో యెఱుంగుట కవకాశము లేకుండనున్నయది! ఇప్పుడీవితర్కమెందులకు? పర్యవసానమునుబట్టిగాని యిదమిద్ధమని నిర్ణయించుట కవకాశము లేదు. ఏదియెట్టులున్నను:—

తే॥ గీ॥ తరుణమునుజూచి గురుదరి ♦ కరిగి, విపుల
భక్తి, కోర్కెను దెల్పఁగా ♦ వలయుసంక
పడుగకుండఁగఁ దలిదండ్రు ♦ లైన, ముద్దు
బిడ్డల యభిమతము దీర్చ ♦ వెలయఁగలరె ?

[శిరఃకంపన మాచరించుచు] ఇదియిట్లుండ యింకొక విషమావస్థనెఱుంగకుండఁగనే నాకుఁదటస్థించునట్లున్నది. దేవయాని సోదరభావమువీడఁచినట్లున్నది. పితృనాజ్ఞోల్లంఘన మాచరించియే యామె సంఘపడ దలఁచినట్లున్నది. నీవునాయెడల సోదరభావమువ్వీడఁజచుట నీకుఁదగదని బోధింతునా? [ఇంచుకాలోచించి] నాకునేనాతొందరపడి యట్లేలబయటఁబడవలయును? ఆమెకోర్కెనాకన్యాపదేశముగా నెరింగించుచున్నంత కాలము నేనును నీకిట్టికోర్కెదగదని యన్యాపదేశముగానే బ్రబోధించెదఁగాక. అంతవఱకు నేనేల వేఁగిరఁబడి లేనిపోని యల్లరిపాలుఁగావలయును? [ఒక్కనిమిషమాగి] సరిదీనికేమి? ఇప్పుడు గురువుగారియాజ్ఞ దేవయానికెఱిఁగించి సమిత్కుశాదులకై వనభూములకేగెదఁగాక. [సమీపించి ప్రకాశముగా] గురుపుత్త్రీ! భవజ్జనకులెందులకో నిన్ను రమ్మని యాజ్ఞాపించిరి.

దేవ—[వెనుదిరిగిచూచి చిఱునగవుతో] అట్లనా? వ కేపోద ముదమ్ము.

కచ—సమిత్కుశములకై నేనరణ్యమునకుఁబోవుచుంటిని. నీవరుగుము.

దేవ—[భయముతో] మరల వన్యభూములకేగెదవా? దేవగురుపుత్రా!

చ॥ వనములకేఁగరాదనుచుఁ ♦ బల్మరు నిశ్చయంబుతోడ నే
ననయము వేఁడుచుండ మది ♦ యందుఁ దలంపక దాని యర్థముం
క్షణ క్షణ మిట్లు బల్కెదవు ♦ చాలును నీదగు సాహసంబునా
మనవిని ద్రోసి రాజనక ♦ మాన్యచరిత్ర గృహంబు జేరుమా!

[ఇంచుక సమీపించి] నీవు మీ దేవలోకములో నడచినట్లిక్కడ నడచినచో ననేకములగు చిక్కులు దటస్థించును. ఎట్టి చిక్కులు వచ్చునో యనుభవముచే నీవిదివఱకెఱింగియే యుంటివి. ఇంకను సాహసమా? ఇంకను-అడవియా? చాలు చాలు. నేనన్ని విధంబుల నుపదేశించినను నామాటవినవేమి కర్మము. నావాక్యములయెడల విశ్వాసము లేనప్పుడు నాయెడల నీకుఁ బ్రేమ లేనట్టు లేగదా? నిన్నింతగా వేఁడుచున్న నన్నిట్లు చిన్నఁబుచ్చుట భావ్యమా?

కచ—గురుపుత్రి! ఇందు నేను నిన్నేమి చిన్నబుచ్చితిని. విద్యార్థి గురువునకుపచర్య లొనరింపక తప్పదు. శుశ్రూషఁ జేయకొడలు దాచికొని బడసిన విద్య నిష్ఫలమని నాయభిప్రాయము. ఇచ్చట నేనంత స్వేచ్ఛగ దిరిగినను నాకేమిలోపము? నీయొక్క-నీజనకునియొక్కయనుగ్రహము-అనుగ్రహమే గాదు-ప్రేమ-స్థిరముగా నాపైన నున్నంతకాలము నాకెట్టి లోపమును రాదని నానమ్మకము. వచ్చినను నిదివఱకు వోలె మంచు విడిపోయినట్లు విడిపోవునుగాని నన్నేమియుఁ జేయఁజాలవు. కావున నీవావిషయమై బెంగఁబెట్టుకొనక నీవు గృహమునకు తిరుగుము. నేనరక్షణములో వచ్చెదను.

శర్మి—[తనలో] వీరెంత సిగ్గుబిడియములు లేనివారు. ఎక్కడ గలుసుకొనిన నక్కడనే గుస గుస లాడుచుండిరే. వీరికెంత ధైర్యము. [ఆలోచించి] ఈతఁడిప్పుడరణ్యములకుఁ బోవునా? నేనీతత్క్షణమే మరిగి నాజనకునకీయంశ మెఱింగించెదఁగాక [అని చెలులతో నిష్క్రమించును.]

దేవ—[శర్మిష్ఠ వెడలుటఁజూచి మఱికొంచెము కచుని సమీపించి] జితమన్మథాకారా! వెడలక తప్పదా? నాకోర్కె చెల్లింపవా? ఎల్ల

ప్పుడును మనయాటలే సాగివచ్చిననుకొంటివా ?

సీ॥ నీమూలమున నిఖి ♦ లామరుల్ సుఖియించు
మార్గంబుగలదది ♦ గనుమయ్యా!
నీమూలమున శర్యు ♦ నీతండ్రి బెగడొంది
కృశియించి చేమానొ ♦ యెంచుమయ్యా!
నీమూలమున లోక ♦ నిందపాల్గాకుండ
కావ్యనిగావఁ ♦ గడఁగుమయ్యా!
నీమూలమున దుఃఖ ♦ నీరధిఁ దరియింపఁ
దలఁచు నాప్రాణముల్ ♦ నిలువుమయ్యా!
తలఁప నిందర కీవె యా ♦ ధారమగుట
నిన్ను బ్రతిమాలుకొందు నా ♦ విన్నపంబు
ద్రోయఁబోకయ్యా! రాక్షసుల్ ♦ దుష్టులయ్యా!
వలదు కానల కఱుగఁగా ♦ వలవదయ్యా!

కచ—గురుపుత్రి! రాక్షసులెంత దుష్టులైనను నన్ను జంపుటకంటె నింకేమియుఁజేయలేరుగదా? ఇదివఱకునన్ను రెండుమూరులు వధియించియు సఫలీకృత మనోరథులుకాజాలిరా? ఇంక నీకేలనీయనుమానము.

దేవ—నిన్ను బ్రతిమాలుకొందును. నీకొకనూతనాంశమెఱింగింపవలసియున్నది. దానివలన నీకు మిక్కిలి మేలగును. నేజెప్పబోవు సంశమునకీవు చెవియొగ్గితివేని నీయాశయమును, దేవతలకోర్కెయుఁ గూడ దీరుటయేగాక నీరాక్షసులకు యుద్ధమునం దపజయముగూడ సంప్రాప్తించును. ఇందులకొక్కమార్గముగలదు. అదినిరపాయంబైన యుపాయము. సమిత్కుశలకై తక్కినశిష్యులను బంపించెదను. నా మాటవిని రమ్మింటికిబోదము.

కచ—దేవయానీ! నాయాశయమునకడ్డురాకుము. నాహృదయాభిప్రాయ మీవెఱుంగవు.

దేవ—మీపదరాజీవములంటి వేడుకొందును. అనుగ్రహించి నన్నుద్ధరింపుడు.

కచ—ఏమీ? ఉద్ధరించుటయా?

దేవ—అగును.

కచ—గురుపుత్రీ! క్రొత్తమాటలాడుచుంటివే.

దేవ—క్రొత్తయేమున్నది. ఉద్ధరింపుమనుట దోషమా?

కచ—నీజనకునియొద్ద శిష్యునిగానున్న నన్ను నీవుద్ధరింపవలయునుగాని నిన్ను నేనుద్ధరింపఁగలనా? ఎంతమాట.

దేవ—అందుచేతనే యొకరి నొకరుద్ధరించికొన వలయును.

కచ—ఎట్లు?

కచ—[తనలో] ఈతనికనుమానము గలిగినట్లున్నది. నాహృదయస్థితాభిప్రాయము మెఱింగించుట కిదినమయమా? [ఆలోచించి] కాదు కాదు. పరస్థలంబున నున్న దానను. ఎవ్వరైనను విన్నచో బ్రమాదమువచ్చును. దీనికిప్పటికీసమాధానముఁ జెప్పెదఁగాక. [ప్రకాశముగా] గురుపుత్రా! ఇయ్యెడనీకు గేవలము శత్రులోకము. నిన్నుఁగాపాడుభారమంతయును నాపైనను-నాజనకునిపైనను విడచి నీజనకుఁడిటకు నిన్నుఁబంపెను. ఇప్పటనీకేదైన నాపదసంభవించినచో మేము—అనఁగా నాజనకుఁడును, నేనును లోకనిందపాలగుదుము. నిష్కారణమట్టిలోకనిందపాలుగాకుండ నీగురువుగారిని-వారితోబాటు సర్వవిధముల నీక్షేమమే గోరుచున్ననన్నును నుద్ధరించుమని గోరియుంటిని.

కచ—[చిఱునవ్వుతో] మీయిరువురి యనుగ్రహము నాపైనున్నంత కాలమట్టినిఁదలేమియు రాకుండ మిమ్ము మీరెగాపాడుకొనఁగలరు.

దేవ—అట్లయిన వెతలకతప్పదా?

కచ—తప్పదు.

దేవ—అట్లయిన వెడలి త్వరితముగ రండు.

కచ—చిటికలో వచ్చెదను. [నిష్క్రమించును.]

దేవ—[తనలో] ఈతనితో నేమనినను యిట్టి వాదనయే వచ్చుచున్నది. ఎప్పటికప్పుడే నీయాశయము మెఱింగించుమని యాశనుండు

సకుఁద్రోయుచుండ సిగ్గువెనుకకులాగుచున్నది. నేనేమిచేయఁగలను? పోనీయుని తెగించి నాయభిప్రాయము వెల్లడించినచో నెటునుండియెటు వచ్చునో యీవార్త తెలియదయ్యె- ఏమైననుసరియే. ఇట్టికారణమింకొక్కమారు లభించినచో స్పష్టముగా నాయభిమతము వెల్లడింపఁగాక.

[అని నిష్క్రమించును.]

ప్రథమరంగము.



## ద్వితీయరంగము.

స్థలము:—అరణ్యము.

నలువురు హంతకులతో ముకుందుఁడు ప్రవేశించుచున్నాఁడు.

ముకుం—[తనలో] కచుఁడు దయ్యమైపోయినాఁడనుకున్నాను: అట్లుగాక చచ్చినకచుఁడు మరలఁబ్రతికి సముద్రములోనుండి యావలకు వచ్చినాఁడఁట. ఈమారెట్లు బ్రదుకునో చూడవలసియున్నది- ఈమారు కచునిఁజంపి దహనపరచి యాబూడిదఁ దెమ్మని రాజు చెప్పినాఁడుగదా? ఆకచునిబూడిద కల్లులోఁగలిపి శుక్రాచార్యునిచేతనే త్రాగించుమని శర్మిష్ఠ చెప్పినది. ఇదిచాలమంచియాలోచన. కచుఁడప్పుడుగూడ బ్రదికెనా-ఆచార్యుని కడుపులో బ్రదుకుతాఁడు- కచుఁడు బ్రదికితే-ఆచార్యులంతరింపవలెను. ఆచార్యుఁడున్నచో కచుఁడు కడతేరవలెను. తన చావుతాను కోరుకొనఁడుగనుక శుక్రుఁడింక కచుని బ్రదికింపఁడు. మాటాడకుండగ నోరుమూసుకొని పడియుండితీరును- ఒకవేళకుమార్తె సౌఖ్యమునకై తాను చచ్చినసరియే యని యనుకొని కచుని బ్రదికించుననుకొందము. అప్పుడు? [ఆలోచించి] అప్పుడింకేమియున్నది. గురుఁడు గుటుక్కున్నట్లేగదా? అప్పుడుమరల నాలుగవమారు కచుని జంపినచో వానినింకెవ్వరు బ్రదికింపరు. అప్పటితో నాకు దాపురించిన శని వదలిపోవును. ఈపూటనే యీవ్యవహారమంతయు జరిగిపోవలయునట. ఆలస్యమన్నివిధములనునష్టమేగదా? పాపము దేవయాని తండ్రిలేనిబిడ్డయైపోవును గావలయును. అప్పుడాదిక్కులేని దేవయా

నిని నేను పెండ్లియాడినచో నాకుఁదీరవలసిన ముద్దుముచ్చటలేమిదీరును? ఎవరిదగ్గఱలుంగను- ఆముచ్చటలన్నియు మన్నుగొట్టుకొని పోవును గావఁ యును- పోనీయేమిచేయగలను. గురుఁడు జీవించియున్నచో మొదటికే మోసమువచ్చును- కావున శుక్రుఁడు చచ్చిపోవుటయే నాకుఁ జాల లాభము.

1 హం—ముకుందా! ఆలోచించుచుంటివేమి?

ముకుం—శుక్రాచార్యునకుఁగాబోయెడి యల్లుఁడను_నేనే యాతనిని చంపుటకాలోచించుచున్నాను.

2 హం—నీవు శుక్రుని కల్లుఁడవైనట్లే భావించుచుంటివే.

ముకుం—ఇంకెంతభాగ్యము? కచునిబూడిద రాజేంద్రునకుఁ గానుకగా యీనాడిచ్చెదమనుకొమ్ము. నేఁటిసభలోనే రాజుగారదికల్లులోఁ గలిపి కావ్యునిచేతఁ ద్రాగించెదరు. అంతతో మనకు జయముగదా? ఈ కార్యమంతయు నేఁడు ముగియుననుకొమ్ము. రేపు నావివాహము.

3 హం—నీ పెండ్లిమాట దేవుఁడెఱుగును, అదిగో! అటుజామడుము. కచుఁడు వచ్చుచున్నాఁడు

ముకుం—[చూచి] కచుఁడొక్కఁడే వచ్చుచున్నాఁడు. ఏమైనను నేను కాఁబోయెడి పెండ్లికొడుకునుగనుక నా చేతులు వసంతమయముగావలసినదేగాని-రక్తమయములు కాకూడదు. కావున నేను దటస్థముగానుండెదను. మీరాతనిపైఁబడి కిక్కురుమనకుండ సంహరింపుడు.

1 హం—కాదామరి. ఈమారు కచునికంటఁబడిన దోరంభతో మాటాడుటకతి త్వరితముగా స్వర్గమునకుఁ బోవలసివచ్చును. అందుచే నీవు తటస్థముగానే యుండవలయును.

ముకుం—నేను పిఱికివాఁడనా? వానికిభయపడి దాగియుండుటకు? పెండ్లికొడుకునుగదా? సంహారము మైలబడుటెందులకని సంకోచించుచున్నాను.

[ఇంతలో కచుఁడు ప్రవేశింపఁగనే హంతకులాతనిమీఁదఁబడి ముక్కముక్కలుగ నఱికి, వెంటనే దహనపరచి బూడిదనొక భరిణెలో భద్రపరతురు.] [తెరవ్రాలును.]

## తృతీయరంగము.



— స్థలము:—రాజబాట —



[ఒకజాంఘికుఁడు ప్రవేశించుచున్నాడు.]

జాంఘి—[దప్పువాయించి] అంతాఁటునండి. యుద్ధంలో గెలిచిన చూళికలు కనిపిస్తున్నాయనియు, అందు శాస్త్రుల్లగారి దయయేకారణమనియు, తేఁపోచి-అందుకై గురువుగారిని గొప్పగాగౌరవిస్తారట, దర్బారులోనికంతా రావలెనిందోహాయి. [దప్పువాయించి యింకొకమారుజెప్పి వెడలిపోవును.]

తృతీయరంగము.



## తురీయరంగము.

— స్థలము;—దర్బారు —



[వృషపర్వుఁడు మహాబలుఁడు శుక్రుఁడు కొందఱు శిష్యులు, కొందఱు వీరులును ముకుందుడును సుచితాసనములపై నుండఁగా దెఱలేచును.

శుక్రు—[పుష్పమాలాంకృతుఁడై యుండును.]

వృష—కావున నో సభాసదులారా! నేఁటి మనయానందము నకుమేరలేదు. రణరంగంబుననుండి వచ్చినవార్త మీరెఱింగియేయున్నారు. అయినను మరల దెలుపుచున్నాఁడను “యుద్ధభూమినుండి దేవతలాఱు క్రోశలదూరము వెనుకకునడచిరి. ఇంకనునట్లే వెనుకవెనుకగా

గృహంబులవఱకును, దరువాత నరణ్యంబులవఱకును బరువెత్తితీయుదురు. కొలదిదినములలో జయలక్ష్మిమూర్తిగా మనలను వరియించు"ననీ. సభాసదులారా! పౌరజానపదులారా! మనకింకేమిగావలయును.

తే॥ గీ॥ రణముఖంబున శత్రుమ • ర్దనము జేసి
తిరుగులేని జయంబు ను • స్థిరయశంబు
బొందఁగలిగిన భాగ్యమీ • పుణ్యమూర్తి
కరుణమనయందు నిలిచిన • కతనఁ గాదె ?

అయ్యలారా! ఇంకొక్కమనవి. ఇట్టిసర్వలోకైకపూజ్యుని మందబుద్ధినై నేనుకొండొక కారణంబున ననరానిమాటలాడి— నిందించితిని. ఇట్టి మహాపురుషులు దూషణ, భూషణ, తిరస్కారంబులను పాటింపరు. ప్రతిఫలము నపేక్షింపరు. తమవిధ్యుక్తధర్మములొనరించుటలో నేమరియుండరు. ఈమ్మహానుభావుఁడు నాయవివేకమును క్షమించి-నన్ను-మిమ్ములను గురువనుగ్రహించినందులకు మనమందరమును గూడ వీరికి కృతజ్ఞులమై యుండవలయును. ఇట్టిమహానుభావుని యేవిధముగా గౌరవింపవలయునో యెఱుంగరాకుండనున్నయది. చేమోడ్చి నమస్కరించుటకంటె మనమేమి చేయఁగలము? [అని పుష్పములతో పాదములబూజించి బంగరు పళ్లెరములో యాపాదములఁగడిగి యా యుదకమందఱకును వ్వయముగానొసంగి యందఱితోఁబాటు దానును శిరముపై జల్లుకొని] సభాసదులారా! ఇఁక నువెడలకుఁడు. [అని మద్యములో నింపిన పాత్రలందరకునొసంగి కచుని బూడిదగలిపిన రజితపాత్ర శుక్రునకొసంగును]

శుక్రు—[కైకొని] సభ్యులారా! తెలిసియో, తెలియకయో, లేక నాయెడలఁగల ఋజువు పెంపుననో వృషపర్వుఁడాడిన వాక్యములఁ బాటింపవలసిన యగత్యము లేదు. అది యొకదోషముగాదు. కావున నే నావిధ్యుక్తధర్మము నేనునిర్వర్తించితిని. ఇఁక ముందుఁగూడ మీమీ ధర్మములు మీరేమఱక యాచరించుచున్నచో దత్ప్రతిఫలము నావలన మీరుపొందఁగలరు. [అని త్రాగివైచును.]

వృష—[అపవారించి] మహాబలా! ఇఁక భయము లేదుగదా?

తురీయాంకము.

శుకా—[అపవారించి] ఇంకేమిభయము, గురుడు మన మాయమాటలకుబ్బి మనకుజిక్కెను. ఇంక లోపము లేదు. కడుడెంత బ్రిదుకడు.

వృష—ఆచార్యోత్తమా! సభజాలింతమా?

శుక్ర—మంచిది.

వృష—[లేచి] సభ్యులారా! ఇంతటితో సభముగిసినది. గురు నిపై గలభక్తిచే మీరియ్యెడకుజనుదెంచి నానంతోషములలో బాల్గొని వందులకే నెంతయు నానందించుచున్నాను. ఇంక మీరు మీమీగృహం బుల కరుగవచ్చును.

సభ్యులు—జయ జయ ధ్వానములతో నిష్క్రమింతురు.

తెరవ్రాలును.

ఇది తురీయాంకము.





శ్రీ

# మృతసంజీవని

అను

# కచ-దేవయాని.

పంచమాంకము ] [ప్రథమరంగము.

—♦ స్థలము:—శుక్రగృహము ♦—

[దేవయానియు- శుక్రాచార్యుఁడును నుండఁగా దెఱ లేచును]

శుక్ర—[నిర్వేదముతో] అమ్మా!

మ॥ కుటిలాత్ముండగు దానవాధముఁడు ♦ గొంతుక జంకు లేకుండన
న్నటులత్యంత నగౌరవంబుగను వాఁ ♦ డాహ్వానమున్జేయ నే
నెటు రావంచుమఁ బల్కఁగాఁగలను? వాఁ ♦ డీమానమున్జేయు సం
చెటులూపింపఁగ లాఁడవింకిపుడు న ♦ న్నేమన్న నేలాభమో.

దేవ—[పాదములచెంత మోకరించి కన్నీరుదుడిచికొనుచు] జనకా! జనకా! నీవిట్లనియూరకుంటివేని నీకపఖ్యాతిరాదా? ఆయపఖ్యాతి భరించుట దుర్భరముగాదా? ఆ దేవగురుండా కచుని శాత్రవలోకముకకుఁబంపుట విన్నవమ్ము కానిగాదా? అట్టియెడ నీవాతని శ్రేయంబునుఁగోరుట నీకుముఖ్యధర్మముగాదా? అపఖ్యాతికోర్చుట కష్టమని రెండుమూరులిదివఱకాతని బ్రదికించితివిగాదా? తండ్రీ! ఆయపఖ్యాతి నేఁడుమాత్రమురాదా? నీకాతనిపై దయరాదా?.........జనకా!

సిగ్గువిడచి నేనా నవమన్మథాకారుని వరించితినని నీకుఁజెప్పికొంటిని గాదా? నీకుమాత్రనేమమునీదిగాదా? నాకోర్కెఁ దెరవెప్పుట నీకున్యాయముగాదా? నాముద్దుదీర్పరాదా? నాకోర్కెఁ జెల్లింపరాదా? ఆపురుషావతంసముని బ్రదికింపరాదా? నామొరాలింపుమంటినిగాదా? నీపదరాజీవములంటి వేడుచుంటినిగాదా? అనుగ్రహింపు మనుగ్రహింపుము ........జనకా! నేను న్యాయవిరుద్ధముగ నడువలేదే—కాని వానిని వరింపలేదే—లేని స్వాతంత్ర్య మూనలేదే—ఋతుమతినైన మూఁడు వర్షములవఱకామె జననీజనకులు వివాహముగావింపకుండ నున్నప్పుడు నాల్గవ వత్సరమున నాబాలికన్యయముగా తనకిష్టమైనవానిని వరింప వచ్చునని ఋగ్వేదమాఘోషించుచున్నదే—నావలన నీకపఖ్యాతి గలుగు నటు లొనరింపలేదే—నిన్నుఁదలకుమించిన కోర్కెఁ గోరలేదే—నీవలనఁగాఁ బనియొనరించుమని నిన్నుఁగోరుటలేదే—తండ్రీ! నీవేనన్ననుగ్రహింపకున్న నాకిఁకదిక్కులేదే—అనుగ్రహించి నాముద్దుచెల్లింపుము.

శుక్ర—[తనలో] లోకమునందాచంద్రతారార్కము లేనిపోని యపఖ్యాతి సంపాదించుకొనుటకంటె—శుక్రాచార్యనికుమార్తెయని వ్రేలు బెట్టి పలువురిచే జూపించుకొనుటకంటె—పితృవంశమున కపఖ్యాతిగడియించి పెట్టుటకంటె—ప్రియకు శాపోపహతురాలై యీజన్మకాలమునటమటంబడుటకంటె—త్రిలోకములకెల్ల సిగ్గొనగూర్చుటకంటె—నాకపరిమిత దుఃఖమొనగూర్చుటకంటె—నీమెకీవలపునందుఁగలుగు ఫలితమింకేమియుఁగానరాదు. నేనేమిచేయఁగలను? వలదని మరలబోధింతునా? అకచుఁడు నీకుసోదరతుల్యుఁడని మరల బ్రబోధింతునా? లేదు—నేనట్లుబోధించినను లాభములేదు. కానున్న దెట్లునుగాకమానదు. అయిన నేనిట్లనితలఁచగాక అదివిని యున్నదేమనునో జూచెదఁగాక. [ప్రకాశముగా] అమ్మా!

చ॥ మనమున నేమిగాఁదలఁచి ♦ మానుగ నన్నతిమాలుచుంటి వో
గముఁగొనఁజాల నాకచుని ♦ గ్రమ్మఱ నను నడిపుఁడేటు? నా
జఠరమున నాదగర్భమున బె ♦ కల్పక మొల్పదివచ్చుగాని నా
తనువునఁబొలింగఁగాఁ దలఁతు ♦ తల్లి! విచారణఁజేసి కోరితే

అమ్మా! నీయుమాటలేల? ఇటు వినుము.

ఆ. వె. కచుఁడు బ్రదికెనని ♦ గడతేసు నీతండ్రి
జనకుఁడుండఁ బ్రదుక ♦ జాలఁడతఁడు
యిరువురందు నిప్పుఁ ♦ డెవ్వారు వలయునో
కోరుమమ్మ నీదు ♦ కోర్కె దీర్తు.

దేవ—[తనలో] అక్కటా? సందిగ్ధావస్థవచ్చినదే. ఏదినిఁగోరిన నట్టిదుస్థవచ్చునో యెఱుంగరాకుండనున్నయది. [ప్రకాశముగా] జనకా! యిన్నిట్టి విషమపరీక్షల పాలుజేసిన నేనేమందును? మీయిరువురును నాకుఁగావలయును ఇందెవ్వరు గడతేరినను నేనుజీవించుటకల్ల. ఇది నానిశ్చితాభిప్రాయము. పిమ్మట నీచిత్తము.

శుక్రు—[తనలో] అనుకొన్నట్లైనది. దైవనిర్ణయమున కెవరేమిచేయుదురు. [ప్రకాశముగా] అమ్మా! నీకోర్కెకేనంతయు సంతసించితిని. నేనొక్క చక్కని యుపాయమూరసితిని. అద్దానివలన మా యిరువురకునుఁగూడ ప్రాణాపాయము రాదు. కాని నీవిచ్చోనుండరాదు. లోనికిఁబొమ్ము. ఆకచుని సజీవునిఁగానొనరించి నీకంటఁబెట్టెదను.

దేవ—[ఆప్యాయముగా నాలింగన మొనర్చుకొని] తండ్రీ! నీవిషయమై భయమేమియు లేదుగదా?

శుక్రు—లేదు. లేదు. నీవుబొమ్ము.

దేవ—[సంతోషముతో నిష్క్రమించును.]

శుక్రు—[క్రోధముతో] ఓహో! రాక్షసకులార్ణవ బడబానల! వృషపర్వా!! నీవింత క్రూరస్వభావుఁడవై పోతివేమిరా? ఇట్టివాఁడ వగుదువని కలనైన నెఱుంగనైతినిరా? నావాక్యంబులకడ్డుపల్కవనియు, నాయిష్టంబునకు వ్యతిరేకముగా నడువవనియు దలంచియుప్పొంగితినిరా మూర్ఖా! నీవీయకార్యకరణ మాచరింపకున్నచో గచునకు నేను సంజీవనీమంత్రమిడుదునో యితనో చెప్పఁజాలనుగాని—ఇప్పుడాతనికి సంజీవనీమంత్ర మీయక దప్పనివరియట్లొనరించి నీకంతమునకీవు స్వయముగా నాతెచ్చికొంటివి. రణమంకనుబూర్ణముగాముగియకమున్నె యిట్టిదౌర్జన్యమునకుపక్రమించితివే. రణమెబూర్తియైనచో నీదౌర్జన్యమింకెట్లు బర్వి

గమించునో యూహించుటకు నవకాశము లేదే?

తే॥ గీ॥ కల్లబొల్లి మాటలచేతఁ • గరము బొగడి
యుత్సవముఁ జేసి మిగుల స • న్మానఁ జేసి
కచుని దహియించి, బూడిద • కల్లునందుఁ
గలిపి త్రాగించితివి దాని • ఫలితమిదిగో.

[అని కమండలోదకము గ్రహించుచున్నాఁడు]

ముకుం—[ప్రవేశించి యొకమూలఁదాగి] గురుఁడెందుకో కోపముగానున్నట్లు కనబడుచున్నాఁడు. సంగతియంతయు దెలిసికొనినా యేమి చెపుమా?

శుక్ర—[క్రోధముతో] ఓరీ రాజాధమా!

కం॥ మృతసంజీవని సుర సం
గతికిఁ దుడుమునఁబడి భయమున • దగు హాసంబీ
గతిఁ జేసితిఁ గావున, దు
ర్మతి ఫలమిది కుండుఁగాక • మంత్రము నీకున్.

ఇంకమీఁదనీ మృతసంజీవనీ మంత్రరాజ మొక్కనికేఁగాక నీరాక్షసకోటి యాపదలడఁచుటకుఁగూడ నుపకరింపకుండ నుండుఁగాక. [అని జలమునువిడచి] వృషపర్వా! ఇంక నీయవస్థఁజూచికొమ్ము.

ముకుం—ఆఁ ఆఁ శపింపఁడమే? ఎంతపనిజరిగినది. కానిమ్ము ఈతఁడు బ్రదికినప్పటి ముచ్చటగదా?

శుక్ర—వృషపర్వుని దురుద్దేశమునకుఁదోడీ మద్యమొకటి సంప్రాప్తించినది. నిక్కమునకిదియపి నీతిమంతులకును దురాశాపాదయులకును దుర్మార్గులకును రాక్షసులకును రాక్షసకృత్యము లొనర్చుచు వారలకును దగునుగాని మానాభిమానములు గల్గినవారికీ దురాచారముదగదు. ఇంకమీఁదనీసురాపానమొనర్చు వారధోగతిపాలై నశయుదురుగాక. [అని జలముగైకొని]

తే॥ గీ॥ నేఁటి మొదలుగ సురఁ గ్రోలు • నీచమతులు
వసుధపైఁ గల సర్వపా • పములఁబొంది

నరకమునఁగూలి పతితులు • నవయునట్టు
లానబెట్టితి నింకన • ట్లగును గాక.

[జలమును విడుచును]

వృషం—నీయిష్టము లక్షశాపములు బెట్టుకొమ్ము. మాకే మియు భయము లేదు.

శుక్రు—[పవిత్రోదకమును మీఁదఁజల్లుకొని] ఇఁక కచునుద్ధరింప వలయును. [అని మంత్రపఠన మొనర్చును]

వృషం—ఇప్పుడొక యుక్తిబన్నవలయును. ఏదిపన్నినచో బాగుండును. [ఆలోచించును.]

శుక్రు—[జలము విడచి] కచా! ఇఁక జీవింపుము.

కచు—[శుక్రుని గర్భములోనుండి] మహానుభావా! మీయాశీర్వచనంబు చెంపున మీగర్భములో మరల సజీవుండనైతిని. దయయుంచి నన్నుఁ బైకి వేగరప్పించు విధంబాలోచింపుడు.

శుక్రు—కుమారా! ఇప్పుడు నీకు నేను మృతసంజీవనీ మహామంత్రముపదేశించుచున్నాడను. ముమ్మారు జపించినంతటనే సంపూర్ణ ఫలము నీకొదవునట్లు వరంబిచ్చితిని. మంత్రపఠనమైన తరువాత నీవు నా గర్భమునుఁ జీల్చుకొని పైకివచ్చి ప్రాణములమీఁద నీనేర్చిన మృతసంజీవనీ మహామంత్రమాహాత్మ్యముఁ జేసి నన్ను బ్రదికింపుము. ఇదిగో మంత్ర మొసంగుచున్నాను గైకొనుము. [అని నిమీలితనేత్రుఁడై యుండును]

వృషం—[సంతోషముతో] సెబాస్ సమయమున కనుకున్నట్లుగా జక్కని యాలోచనదట్టినది. గురునికడకుఁ జేరుకొని కచుఁడు రాగానే గురుని బ్రదికింపక పూర్వము 'నీవుచచ్చిపోయితివని దేవయాని బలవంతముగాఁ దన ప్రాణములను దీసికొనుచున్నది. వేగవచ్చి రక్షింపుము రక్షింపుమ'ని యామె చెలికత్తె బలికినట్లు బలికినచో మరలవచ్చి గురుని బ్రదికింపవచ్చునని దలంచి బలవన్మృతణము పాలు గాకుండ దనప్రియురాలిని గాపాడుకొనుటకై బయిగిడకమానఁడు. వెంటనే యుద్యానవనమున కరుగుచున్న కచునీ మార్గమధ్యమున జంపిన

చో కని వదలిపోవును. గురుఁడిఁక బ్రతుకఁడుగదా? గురుఁడే లేనప్పుడు కచుఁడెట్లు బ్రదుకును? అప్పుడు దేవయాని నాసొమ్మేయగును. ఇంత కాలమునకు నాకోర్కె ఫలోన్ముఖమునకు వచ్చినది.

శుక్ర—కుమారా! మంత్రపఠనమైనదా?

కచ—[గర్భములోనుండియే] అయినది.

శుక్ర—అటులయిన నేను చెప్పినట్లుగా బైటవచ్చి మరల నన్ను బ్రదికింపుము. [అనిపడుండి పెద్దకాలువగవ్వకొనును.]

[కచుఁడు గర్భమునుండి బైటవచ్చును. పుష్పవృష్టి గురియును.]

ముకుం—[చాటుననుండి] అయ్యో! అయ్యో! కచుఁడుగతించెనని దేవయాని బలవంతముగాఁ దనప్రాణములను విడచుచున్నది. రక్షించువారెవ్వరును లేరా? రారా? ఆమె చావవలసినదేనా? అయ్యో! అయ్యో! [అని పరుగిడును.]

కచ—[విని] ఆమె కకాలమరణము లేకుండనుండుగాక. [అని పవిత్రోదకము నిండాఁ జల్లుకొని రెండుచేఁగూర్చుండి మంత్రమును బఠించి జలమును విడచుచున్నాఁడు. శుక్రుఁడు లేచును. దేవదుందుభులు మ్రోగును.]

కచ—గురువరా! తవానుగ్రహవశంబున పునర్జీవుఁడనైతిని. నాకానంతోషము లేకుండనున్నది. నాసోదరి దేవయాని నాదుర్మరణవార్తవిని తానుకూడ మరణింపనున్నదట. పోయి యామెను వారించి దోడ్కొనివచ్చెద. సెలవొసంగుఁడు.

శుక్ర—మంచిది.

[తెరవాలును.]

ప్రథమరంగము.



## ద్వితీయరంగము.



[దేవయానియు, కచుఁడును నిలువంబడియుండఁగాఁ దెఱలేచును.]

దేవ—[నిర్వేదముతో] మనోహరా! నీవిట్లనుట భావ్యమా? నాహృదయము నీనిరాశాకఠోర వాక్యజాలములచే వ్యాకులపడిపోవుచున్నదే?—నాకునీపైనఁగల మోహముద్దామమైనదే?—సరళమైనదే?—నిబిడీకృతమైనదే—అగాధమైనదే—నిశ్చలమైనదే-పరిపూర్ణమైనదే_అట్టి ప్రేమమోహినీ మూర్తియగు-నీప్రియాకాంక్షిణియగు-నీ మనోహర, రూప, సౌందర్య వాగ్వైభవంబులకలరి నిన్నే దైవముగా—భర్తగా భావించుకొని నీతోడిదే లోకమనుకొని-నీతోడనే సుఖింపవలయునని యుబలాటపడుచున్నదగు నీదేవయాని-తనయాత్మ్రలిలఁ దనకుఁదానై-తన స్వహస్తములతో నిదివఱకే నీకర్పణఁజేసికొన్నదే—అందుచేతనీదేవయాని నీస్వాధీనమైపోయినదే-యీసొత్తును మీరుపరిగ్రహింపుఁడని వేడుకొనుచున్నదిగాని మిమ్మెట్టి యకార్యకరణమునకును బ్రేరేపించుటలేదే? ఇందన్యాయమేమియులేదే-ధర్మవిరుద్ధమేమున్నది? నీవామభాగభూషణమగుటకువివ్విళ్ళూరుచున్న నామనోరథమిట్లు భగ్నంబుగావించుట నీకు భావ్యమా? ఓకరుణామయా!

సీ॥ మర్మమా? లేక నా ♦ కర్మమా? అటుగాక
ధర్మమా? యిటుపల్క ♦ ధన్యచరిత!
భారమా? లేక నా ♦ నేరమా? యిదిదురా
చారమా? యిటుసేయ ♦ సరసవరుఁడ!
కోపమా? లేక నా ♦ లోపమా? యిటుగాక
పాపమా? నకుఁగూడ ♦ భవ్యచరిత!
వేసమా? లేక నా ♦ దోసమా? యిదిపరి
హాసమా? యిటులాడ ♦ హాసుకాడ!
ప్రాణములనైదుఁగూడ నీ ♦ పైన నిలిపి
నిన్నెదైవంబుగా మది ♦ నెన్నుకొనుచు

సుఖపడఁడి కాలమున కెదు • ర్జూచుచున్న
తోయజాక్షిని దుఃఖాబ్ధి • ద్రోయఁదగునె?

కచు—[చెవులు మూసుకొని కొంచెము వెనుకకుఁదగ్గి] హరి హరీ! పాపము శమించుఁగాక. పాపము శమించుఁగాక- సోదరీ! విదుషీమణివగు నీవిట్లాడఁదగునా? అన్నవస్త్రంబులిచ్చి రక్షించినవాఁడును, విద్యాదానమొనర్చినవాఁడును, అగ్రజుఁడును, పిల్లనిచ్చినవాఁడును తండ్రితో సమానుఁడని యార్యులు పల్కుదురు గదా? ఏతత్కారణమున నీజనకుండును నాకు జనకుఁడే గదా? అట్టియెడ నీవు నాకు సోదరివి గావా? సోదరీసమానురాలవగు నీవిట్టి తుచ్ఛంబగు కోర్కె నన్నుఁ గోరుట భావ్యమా? ఇంతమాత్ర మూహింపవా? నీవు నాకనేకోపకారము లొనర్చినమాట వాస్తవమే. అందులకు నేనాజన్మకాలమును నీకుఁ గృతజ్ఞుఁడనై యుండెద. అంతియేగాని నీకోర్కెమాత్రము చెల్లించుటకవకాశము లేదు. అట్టికోర్కె నీవు గోరరానిది. నేను వినరానిది. ప్రాజ్ఞులు మెచ్చరానిది. కావున నిప్పటికైన నీబుద్ధి మరలించుకొని, నాయందుదయుంచి-నన్ను నీసోదరునిగా భావించి-నాపోక కనుమతింపుము. నన్ననుగ్రహింపుము.

దేవ—[ఉద్వేగముతో] ఓపురుషపాంసనమా! మరల మొదటికి వచ్చితివా? నన్ను ధోగతిపాలొనరింపఁ దలఁచితివా? నీవే నాయెడ పరాన్ముఖత వహించిన-నీవే నన్నుఁ బరిగ్రహింపకున్న-నీవే నన్ను ద్రోసిరాజనిన-నాకిఁకేది దిక్కు. ఓమోహనాకారా! నీచెప్పినయర్థము నాతలకెక్కదు. అదియునుఁగాక పినతండ్రిభార్య-పినతల్లిగానట్టుల, మేనత్తభర్త-మేనమామగానట్టుల నీచెప్పినవారును దండ్రితో సమానులుగాని తండ్రులుగారు. అట్లయ్యెనేని యెవనిభార్య వానికి సోదరి కాకమానదు. తండ్రినెట్లుగౌరవింతుమో, తండ్రినెట్లుపూజింతుమో, తండ్రియాజ్ఞ నెట్లుపాలింతుమో, నీచెప్పినవారినిఁగూడ నట్లుపూజించి గౌరవించి, వారియాజ్ఞ పాలింపవలయునని పెద్దలయభిమతముగాని-నీచెప్పినట్లు భావింపుమని పెద్దలయభిమతముగాదు. అదిప్రపంచవిరుద్ధమైన దలంపు. కొందఱు మహానుభావులు కన్యాదానముతో బాటుదిమో

యొక్క విద్యాదానముగూడ నొసఁగుచుండెనే వాఁడు. ఇందు దోషము లేదు. ఇటికుశ్శంకలు పెట్టుకొనక నన్ను గ్రహించి రక్షింపుము.
[అని సమీపించును.

కచు—[వెనుకకుదగ్గి] సోదరీ! వలదు. నా సమీపమునకు రా వలదు. నీయర్థము లేని వాక్యములకు సమాధాన మీయవలసిన పని లేదు. నేనిటు విద్యార్థిగా బ్రవేశించిననాఁడు నీతండ్రి నీకు నన్ను జూపి—

ఉ॥ సోదరుఁడట్లుగా గనుఁడు ♦ జూచుకొనంతగు వీనినంచు నీ
కాదరచిత్తతన్ దెలుప ♦ నప్పుడు సమ్మతిఁ జూపి, నేఁడు మో
గాదని తండ్రియాజ్ఞ నతిఁ ♦ గా నను గైకొనుఁడంచు వేఁడుటో
సోదరి న్యాయమా? తలఁచి ♦ చూడుము వీడుము తుచ్ఛకోరికల్.
మరియు నో సోదరీ!

తే॥ గీ॥ తండ్రియాజ్ఞను మీరిన ♦ తప్పుకొఱకు
ధవునిఁగా సోదరునిఁ గోరు ♦ తప్పుకొఱకు
నరకకూపంబు నప్పుడి ♦ నవయవలయుఁ
గాన యీ తుచ్ఛకోర్కెను ♦ మాను మమ్మ!

దేవ—[విచారముతో] వలతేఁడా! నేను యమదండనమున కైనను సమ్మతింతును గాని మన్మథార్తింబడి మ్రగ్గఁజాలను. దయయుంచి నన్నేలుకొమ్ము. నేను కోరరాని కోర్కెను గోరి నిన్ను బాధించుట లేదు.

తే॥ గీ॥ నీవు బ్రహ్మచారివి, మరి ♦ నేనుఁగూడ
కన్యకనుఁగాన మన సమా ♦ గమముఁ జెల్లు
లేనిపోనట్టి వంకయు ♦ మూనఁబోక
నెమ్మి నన్నేలుకొమ్ము శ్రీ ♦ ఘ్రమ్ము రమ్ము

జితమన్మథాకారా! నాతలపి నాఁటిదిగాదు. చూడుము.

సీ॥ అలనాఁడు నీరాక ♦ తిలకించి నంతనే
తగునాకు నితఁడని ♦ తలఁచికొంటి
వినుశిష్యుఁడుగ నాఁడు ♦ జనకుండు గైకొన
ధన్యాత్మనని యుడన్ ♦ దలఁచి కొంటి

మా, యాశ్రమంబున ♦ మా తండ్రి నిన్నుంప
ఫలియించె వ్రతమని ♦ తలఁచి కొంటి
నెటులైన నీచెట్టఁ ♦ బటుతరంబుగఁబట్టి
చెలుల మెప్పునుఁగాంచఁ ♦ దలఁచి కొంటి
మారసుకుమార! సుందరా ♦ కారధీర!
నిన్నుఁ జేఁబట్టి సుఖయించ ♦ నున్న నాదు
యాశలకునెల్ల భరత వా ♦ క్యంబుఁ జెప్ప
భావ్యమానోత్క సద్గుణా ♦ భరణ నీకు!

[మిక్కిలి సామీప్యమునకు జేరి బ్రతిమాలుచు] ఓపురుషాగ్రగణ్యా! నిన్న కార్యకరణమాచరింపుమని నియోగించుట లేదు. నీయందే పంచప్రాణములను నిల్పికొనియున్న నన్ను నీ శిష్యునిగాఁ గైకొను టుత్తమమా? కాదా? యని సంశయించుచున్న మజ్జనకునకును కన్యాప్రదేశముగాఁ గైకొనకతప్పదని సహేతుకముగా నిరూపించిన నేను- మద్యపానము విసర్జించుమని నీవుబోధించినప్పుడుత్సాహముతో దాని నంగీకరించిన నేను-క్రూరరాక్షసులెల్ల నిన్నుఁబట్టివధించినప్పుడు-మహాప్రళయము సంభవించినట్లు విచారించి-నాజనకుని పదరాజీవములంటి వేడి-నిన్ను సజీవునిగా నొనరించుకొని-బ్రహ్మానంద భరితురాలనైన నేను-నిన్నింతవఱకును గంటికిఱెప్పవోలెఁ గాఁపాడుకొనుచు వచ్చిన నేను- నిన్న రాక్షసులు మ్రింగించినప్పుడు ప్రపంచము మునిఁగిపోయినట్లేడ్చిన నేను-నిన్న కార్యకరణమునకై నియోగింతునా? రమ్ము. నన్నానందవార్థిని లోలాడింపుము. [మరియు సమీపించి] మోహనాంగా! ఇది దూష్యముకాదని మజ్జనకునిచేతనే యొప్పించెదను మృతసంజీవనీ మహామంత్రముతోఁబాటే నారీమణినిఁ గూడఁ గైకొనుమని నాతండ్రి గారినిన్నుఁగోరి నీకుఁగన్యాదానము చేయునట్లేర్పాటు గావించెదను. వారనుమతించినచో దూష్యముగాదుగదా? నీకేల సంశయము. అప్పుడైన ననుమతించెదవా?

కచు— దేవయానీ! నీవు నిష్కల్మష హృదయురాలవని నేనింతవఱకును భావించితిని: నీజనకుఁడు తొలుదొల్తనే సోదరునిఁగాఁ జూచు

ఉ॥ చెల్లనివావిబెట్టుకొని ♦ చల్లలు చల్లలటంచు నీవు న
న్నల్లనబిల్చుచుండి యిటు ♦ లారడిబెట్టగఁ బాడి వేలనో
వల్లభ! యీవిధంబుగను ♦ బల్కకు నీదగు ప్రేమపూర్ణమా
చల్లనిఁ జూపుఁజూచి గుణ ♦ సాగర! సన్నుతియింపుమా ముదన్.

కచ — దేవయానీ! నీగుణము మర్యాద నతిక్రమించుచున్నది. నేను నీతుచ్ఛకోరిక వినఁజాలకున్నాను. నీయాజ్ఞతో నాకింక గత్యము లేదు. నేనుపోయివచ్చెదను. [అనినడువఁబోవ దేవయానియడ్డుకొనును.]

దేవ — ప్రాణప్రియా! ఎటుఁబోయెదవు?

కచ — నేను నీప్రాణప్రియుఁడనుగాను.

దేవ — కానిచో మానునా? ఎటకుఁబోయెదవు?

కచ — నాస్వస్థలంబునకు.

దేవ — నీవొక్కరుఁడవే.

కచ — అగును.

దేవ — నేనుపోనీయను.

కచ — ఆపెదవా?

దేవ — నన్నుఁబరిగ్రహింపవా?

కచ — అకార్యవిడువుము. నిన్ను బ్రతిమాలుకొందును.

దేవ — బ్రతిమాలుకొందును. నీవును బోవలదు.

కచ — నాకు నీయంగీకారముతో బనిలేదు.

దేవ — అటులయిన నీయంగీకారముతో నాకును బనిలేదు. [అని చేయిపట్టఁబోవఁగా కచుఁడు గెంటివేసి]

కచ — ఏమీ సాహసము. దూరముగానిల్చి మాటలాడుము. స్త్రీభూషణంబగు సిగ్గువిసర్జించితివేమి? ఇంత రాగవైరివేమి? నీజ్ఞానము తయము నంతరించినదా? మహాత్ముటికిని జెప్పుచుంటిని. నేను నిన్నుఁ బరిగ్రహింపను. నీవుకోరినను లాభము లేదు.

దేవ — నేను కోరకమానను.

కచ — నీవు కోరినను లాభము లేదు,

దేవ — ఎందుచేత?

కచు—నాగురుపుత్రికవగు నీవు నాసోదరివి.

దేవ—అట్లనుట నీకు భావ్యముగాదు.

కచు—నావితరుప లెన్నకుండుట నీకుచితముగాదు.

దేవ—అట్లనుట నిను కోలుకుందరాకారునకుచితము కాదు.

కచు—[మారాడక పోవుచుండును]

దేవ—[తనలో] మాటలతో నీతడు లొంగునట్లు లేదు. కొంచెము బెదరించి చూచెదగాక. (ప్రకాశముగా) నాకోర్కె దీర్పకున్న నీకుజయము కాదుసుమా?

కచు—ఏమీ? జయము కాదా? ఎందుచేత?

దేవ—నీవే యూహించుకొనుము.

కచు—నాకర్థమగుటలేదు.

దేవ—బ్రతిమాలాడినకొలదియు బిఱ్ఱబిగియుచుంటివి. నన్నొల్లనిచో శాపము తప్పదు,

కచు—ఏమీ శాపమా?

దేవ—అగును.

కచు—బెదరించుచుంటివా? అందులకు భయపడి నీయిచ్ఛ కోరికను మతింపను.

దేవ—అంగీకరింపవా? అదృష్టవిహీనా?

కచు—నాకీయదృష్టము వలదు

దేవ—[నవ్వివించి] మహానుభావా! నిన్ను శపించుటకు నోరు రాదు. సృష్టికర్తయంతటివాడే తనకుమార్తెయగు సరస్వతిని వరించి వివాహమాడెను. అయ్యది దూష్యముకాలేదు. సరిగదా పెద్ద లంగీకరించిరి. అట్లయినదియును దూష్యముగాదు. నన్నేలుకొమ్ము.

కచు—పరమేశ్వరుని యుదహారణముగాఁ గైకొనకుము. నాకది నంతక కిలేదు.

దేవ—తప్పించుకొనుటకు వీలులేని సమాధానమొసంగిన నో నన్ను బరిగ్రహింతువా?

కచు—[లేరిబాతిచూచును]

దేవ—అట్లు చూచెదవేమి? నీజననీవృత్తాంతమును దలంచి కొమ్ము. నన్ను బరిగ్రహింపుము. [అని పట్టుకొనబోవును.]

కచ—[క్రోధముతో గెంటివైచి] నీచురాలా! [అని పెడమొగము పెట్టుకొనును.]

దేవ—[అవుడు కోపముతో] ఓయి భాగ్యశిరోమణీ! నావలన నుపకారమును బొందియు నన్ను నాదరణ జేయుచుంటివా? ముమ్మాటికిని నాకోర్కె కనుమతింపవా?

కచ—అనుమతింపను.

దేవ—ఓపురుషరూప పిశాచమా! నిన్ను గురించి నిష్కారణముగా నల్లిపాలైపోతిని. కానిమ్ము. నాయా—శా—ల—త—ను—నీ—కానగోటితో ————నాథా! నిన్ను శపించుటకు నోరాడదు. నన్ను దయజూడుము.

కచ—సోదరీ! ఈపురుషరూప పిశాచమును బాధింపకుము.

దేవ—క్రోధముజూపించినచో లొంగుబాటునకు వచ్చెదవేమోయనియట్లంటిని. ముద్దులొలుకు నీవదనమండలముం జూచిన మదనతాపముదయించునుగాని క్రోధమదయించునా? రమ్ము. నన్నుగై కొమ్ము. [కౌగిలింపబోవును.]

కచ—[తప్పించుకొని] సోదరీ! నన్నంటకు.

దేవ—నేను నీకీయబోయెడి శాపమువిగుల ఘోరమైనది జుమా? మించిన తరువాత చింతించిన లాభములేదు. నాశాపము దేవేంద్రాదులైనను ద్రిప్పలేరు. ఆలోచించుకొమ్ము.

కచ—నేనాలోచింపనగత్యములేదు. నేమనిన్నొల్లను.

దేవ—అట్లయిన శాపదగ్ధుడవగుము. నాయాశాలతను ద్రెంచితివిగాన నీవేయాశాలతతో నిక్కడకువచ్చితివో.............వద్దుసుమా? చెడిపోయెదవు.

కచ—నిన్నంటినచో చెడిపోదునుగాని నీశాపముచే నేనెన్నడును చెడిపోను.

దేవ—అటులైన శాపమిమ్మందువా?

కచ—నీచేతనైనపని నీవు చేసికొమ్ము.

దేవ—అట్లయిన సరియే. నిన్ను శపించుటకంటె నిన్ను కౌఁగిలించుటయే నాకు చేతనైనపని. [అని కౌఁగిలింపఁబోవును.]

కచ—[గెంటివైచును.]

దేవ—[క్రిందపడి లేచి] దుర్మతీ! నాకోర్కె దోసివుచ్చితివి గావున నీకోరినట్టి మృతసంజీవనీమంత్రము..............కచా! ఇంకను మించిపోలేదు ఏమందువు.

కచ—నిన్ను నేను వివాహమాడను.

దేవ—[మండిపడిపోవుచు] నాకోర్కె దోసివుచ్చితివి గావున నీకోరినట్టి మృతసంజీవనీ మంత్రము..........శాపమీయనా?

కచ—కానిమ్ము.

దేవ—నీకు ఫలమీయకుండుగాక. ఇఁకపొమ్ము.

కచ—అట్లేపోయెదను. సోదరీ! నన్ను కార్యకరణమునకుఁ బురికొల్పి విఫలమనోరథురాలవై శపించితివా? కానిమ్ము నాకీమంత్రము బనిచేయకున్నమాని నాశిష్యగణమునకైనను బనిచేయుగాక. నన్ను న్యాయముగా శాపదగ్ధుంజేసితివిగావున నీవు నీతిఁదొరంగితివి గావున నీకంటె తక్కువజాతిపురుషుని బెండ్లియాడి యూరును జేరును లేకుండ బోవుదువుగాక. [అని వెడలును.]

దేవ—హా! [అని మూర్ఛిల్లును.]

తెఱపడును.

పంచమాంకము సర్వమును



